సాహిత్య
ప్రస్థానం
సంపుటి : 12 జనవరి 2013 సంచిక : 1

# కాలానికి ప్రతినిధులు

కాలం మారుతున్న వేళ... కలాలు కరుకెక్కాలంటున్నాం. కల్లోల కాలానికి ప్రతిస్పందించమంటున్నాం. నూతన సంవత్సరానికి స్వాగతం పలికేందుకు సిద్ధం కావలసిన వేళ దేశ రాజధాని ఒక అమ్మాయిపై జరిగిన అఘాయిత్యానికి అట్టుడికిపోతున్న వర్తమానాన్ని వీక్షించమంటున్నాం. ఏ సాంస్కృతిక నేపథ్యం ఇంతటి అఘాయిత్యాలకు అమానుషాలకు కారణమవుతున్నదో దాన్ని ఖండించేందుకు కంకణధారులు కావాలంటున్నాం.

కవులు పాత పత్రికలు వేస్తే ఏదో ఒకటి చేతిలో పెట్టే చిల్లరకొట్లను కూలగొట్టి ఎకాఎకిన అమెరికా నుంచి దిగివస్తున్న వాల్‌మార్ట్ మార్కు ఎఫ్‌డిఐల ప్రమాదాన్ని గుర్తించమంటున్నాం. సంతలూ సంస్కృతులూ గ్లోబలిపీఠంపై కెక్కాక మనం వేసుకునే సంపుటాలు సంకలనాల సంతోషం ఎంతవరకో ఆలోచించమంటున్నాం.

కాలం కన్నా ముందుకు చూడగలవారుగా చెప్పే కవులు రచయితలు కలుషిత రాజకీయాల సంకుచిత వ్యూహాలకు సమిధలు కావద్దని కోరుకుంటున్నాం. సంపన్నాకర్షణలు సర్కారీ ప్రలోభాలలో కొట్టుకుపోరాదని అభ్యర్థిస్తున్నాం. కీర్తి చంద్రికలు క్షణికమే గాని ఆశయ సూర్యకాంతి అనంత శక్తివంతమని గుర్తించమంటున్నాం. అవినీతి అత్యాచారాలు అఘాయిత్యాలు ఆధిపత్యాలు ఆడంబరాల విజృంభణ సమయంలో అక్షరాన్వేషకులు వాటిపై పోరాటానికి సమాయత్తం కావాలని పిలుపునిస్తున్నాం.

బొమ్మలు : శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...



సంపాదకవర్గం
తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వీరప్రసాద్
వల్లభాపురం జనార్దన
కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
Prasthanam_ss@yahoo.co.in
www.prasthanam.com



కథ

# మాయల మరాఠీ

డా. ఎం. హరికిషన్

✆ 9848541485

శైలజ కుక్కర్ గిన్నెలోంచి అన్నం తీసి క్యారియర్‌లో సర్దుతూ వంటగదిలోంచి పడకగదిలోకి చూసింది. భర్త సాయిరాం ముసుగుతన్ని నిద్రపోతున్నాడు సమయం ఎనిమిదవుతూ వుంది. ఆఫీసులో పనుండడంతో రాత్రి చాలా ఆలస్యంగా వచ్చాడు. మామూలుగా అయితే సాయంత్రం ఆరుగంటలకల్లా చేరి ఉదయం ఏడుకంతా బైలుదేరతాడు.

పిల్లలిద్దరూ టిఫిన్ చేస్తున్నారు. పాప నాలుగో తరగతి. బాబు ఒకటో తరగతి. బడేమో తొమ్మిదికి.

తొందరగా తినండమ్మా... ఆలస్యమవుతావుంది" అని శైలజ లోపలి నుంచే అరుస్తూ క్యారియర్లు నింపి బుట్టలో సర్దింది. చిన్నోనికి పలక, పుస్తకాలు బ్యాగులో సర్ది పెన్సిల్ బాక్స్‌లో బలపం, పెన్సిల్ రబ్బరు అన్నీ వున్నాయో లేదో చెక్ చేసింది. చిన్నోడు రోజుకొక బలపం పోగొట్టి, పెన్సిలు ముక్క విరగ్గొడుతుంటాడు. పెన్సిల్ జువ్వుతూ "ఏమ్మా... నీ బాక్స్‌లో అన్నీ వున్నాయా" అని అడిగింది పాపని. "వున్నాయమ్మా... కానీ పెన్సిలే చిన్నగైపోయింది. రేపు కొత్త దివ్వు" అంది పళ్ళెంలో చేయి కడుక్కుంటూ.

అలాగే గానీ... పోయి మీ నాన్నని లేపు. బడి దగ్గర వదిలేసి వస్తాడు" అంటూ మళ్ళా వంట గదిలోకి పోయింది.

సాయిరాం అప్పటికే నిద్రలేచి పావుగంటయింది. కానీ ఎవరూ కనుకోకుండా ముసుకు కప్పుకొని పండుకొని వున్నాడు. పాప వస్తూ వుంటే గుండె దడ దడా కొట్టుకోసాగింది. కళ్ళు గట్టిగా మూసుకోని అలాగే పండుకున్నాడు.

నాన్నా... నాన్నా... లెయ్యి నాన్నా.. అమ్మ చెప్పింది. బడి దగ్గర వదిలెయ్యాలంట" అంటూ భుజం పట్టుకొని వూపుతూ అరిచింది పాప.

ఆ మాటలేవీ వినబడనట్టు కళ్ళు మరింత గట్టిగా మూసుకొని నిద్ర నటించసాగాడు సాయిరాం.

అంతలో శైలజ లోపలికి వచ్చి "లెయ్... లెయ్.. అవతల మొదటి గంట కొట్టే సమయమవుతావుంది. కావాలంటే వదిలేసి వచ్చి పడుకో" అంది పైన కప్పుకున్న దుప్పటి లాగేస్తూ.

"అబ్బా... ఏందే పొద్దున్నే.. కొంచెం గూడా నిద్ర పోనియ్యకుండా.. నువ్వు పోయి వదిలేసి రావచ్చుగా" అన్నాడు విసుగ్గా అటువైపు తిరుగుతూ.

నేనా... మళ్ళా చీర కట్టుకోవాల, ముఖం కడుక్కోవాల, తలదువ్వుకోవాల... మీ మాదిరి చిటికెలో అంగీ ప్యాంటు తగిలించుకోని పోయి రాలేం గదా... ఎంతసేపు ఐదునిమిషాలు... వచ్చేలోపు వేడి వేడి కాఫీ చేసి పెడతాలే' అంది వూరిస్తూ.

"నిద్ర సరిగాలేక... వళ్ళంతా ఎట్లాగో వుందే"... తప్పించుకోవడానికి ఆఖరి ప్రయత్నం చేశాడు.

ఎప్పుడు నేనే గదా వదిలేసి వచ్చేది... ఈ రోజు నువ్వున్నావు గదా అని పనులన్నీ నెమ్మదిగా చేసుకొంటి. ఇప్పుడు పోనంటే ఎట్లా గంట కొట్నారంటే బైటే నిలబెట్టి నానా మాటలంటారు. మొన్ననే ఆలస్యమైందని తిడ్తే పాప ఇంటికొచ్చి పడీ పడీ ఏడ్చింది.

"న్నాన్నా.. లెయ్యి నాన్నా.." అంటూ బాబు ఒకవంక, పాప ఒకవంక చేతులు పట్టుకొని లాగసాగారు.

సాయిరాంకి ఏంచేయాలో అర్థంగాక లేచి కూర్చున్నాడు. గబగబా

లోపలికి పోయి ముఖంమీద ఇన్ని నీళ్ళు చల్లుకొని అంగీ ప్యాంటు వేసుకున్నాడు. జేబులో నూరు రూపాయల కాగితం కనబడింది. జీతం రావడానికి మరో రెండు రోజుల సమయముంది. ఎప్పుడు ఏ అవసరం ఎటువైపు నుంచి ముంచుకొస్తాదో తెలీదు. నెలాఖర్లో ఎవర్నీ అడగలేం. కంపెనీలో అందరి పరిస్థితి అడికాడికే. పిల్లల వంక చూశాడు. ఇద్దరూ సాక్సులు వేసుకొని బూట్లు తొడుక్కుంటున్నారు. పాప గుసగుసగా తమ్మునికేదో చెబుతూవుంది. వాడు కళ్ళు పెద్దవి చేసి వింటున్నాడు. అది చూసి సాయిరాం గుండె ధడ ధడా కొట్టుకోసాగింది. అట్లాగే వాళ్ళనే చూస్తుండిపోయాడు.

"ఎంత సేపలా బెల్లం కొట్టిన రాయిలెక్క గుడ్లప్పగించి చూస్తావుంటావు. తొందరగా పోయి రాపో. కావాలంటే మధ్యాన్నం డ్యూటీ కెళ్ళేదాకా ఎంతసేపు పన్నుకుంటావో పన్నుకుందువు గానీ" అంది శైలజ.

సాయిరాం నెమ్మదిగా క్యారియర్ బుట్టలు అందుకున్నాడు. పిల్లలు అప్పటికే బ్యాగులు భుజాలకు తగించుకొని సిద్ధంగా వున్నారు. బడి దగ్గరే పదినిమిషాలంతే. పిల్లలే పోయి రావచ్చు. కానీ మధ్యలో ఒక రోడ్డుంది. వాహనాలు అటూ యిటూ తిరుగుతుంటాయి. పాపతో భయం లేదు గానీ చిన్నోనితోనే చాలా కష్టం పగ్గాలేని దూడ లెక్క వురుకుతుంటాడు.

పిల్లల చేతులు పట్టుకొని నెమ్మదిగా రోడ్డు చేరాడు. ఏదో ఆటో సర్రున కొంపలేవో మునిగిపోతున్నట్లు వేంగంగా దూసుకువస్తోంది. అది పోగానే జాగ్రత్తగా రోడ్డు దాటాడు. మరో ఐదు నిమిషాల్లో బడి వచ్చేస్తాది. బడి దగ్గరవుతున్న కొద్దీ సాయిరాం గుండె కొట్టుకునే వేగం పెరిగిపోసాగింది. పిల్లలకు ఏవేవో మాటలు చెబుతున్నా ఇద్దరి దృష్టీ తనమీద లేదు.

వాళ్ళ చూపంతా బడికి ఎదురుగావున్న అంగడి మీదే అతుక్కుపోయింది. పిల్లల్లో చాలామంది అక్కడ ఆగిపోతున్నారు. కొందరు తల్లిదండ్రులు పిల్లలు అడిగినవి కొనిస్తావుంటే మరికొందరు ఏమాత్రం పట్టించుకోకుండా కళ్ళతోనే బెదిరిస్తూ బర బరా లాక్కుపోతున్నారు.

పాప చిన్నోనికేదో సైగ చేస్తోంది. పాప పెద్దది కావడంతో తండ్రికి భయపడతాది. చిన్నోడలా కాదు. పరమ మొండి. పట్టుపట్టినాడంటే తలకిందుల తపస్సు చేసినా వదలడు. పాప తనకేమన్నా కావాలంటే నేరుగా అడగదు. నెమ్మదిగా చిన్నోనికి ఎక్కించేస్తాది. వానికి వూరించి వూరించి చెప్పి రెచ్చగొడతాది. దాంతో వాడు ఎక్కుపెట్టబడ్డ బాణంలాగా సిద్ధమైవుంటాడు.

సరిగ్గా అంగడి దగ్గరకి వచ్చేశారు.

చిన్నోని అడుగులు ఆగిపోయాయి.

"నాన్నా" అన్నాడు నోరు తెరచి.

సాయిరాం గుండె ఒక్కక్షణం ఆగింది.

"నాన్నా... ఒక సూపర్ జాయ్ చాక్లెట్ కొనియ్యి నాన్నా" అన్నాడు ముద్దుగా.

ఒక్కసారిగా బాంబు మీద పన్నట్టయ్యింది. లేచినప్పటి నుంచీ అదే వూహిస్తూ... ఎట్లా తప్పించుకోవాల్నా అని ఆలోచిస్తావున్నాడు.

"ఏముంటాయిరా దాంట్లో.. కావాలంటే వేరేవి కొనిస్తాలే" అన్నాడు నెమ్మదిగా.

"బళ్ళో అందరూ తెచ్చుకుంటున్నారు నాన్నా... నువ్వేమో ఎప్పుడడిగినా రేపు రేపంటూ తప్పించుకొంటున్నావు. ఎదురింటి రేఖయితే పెద్ద ఫోజు. దాని దగ్గర సూపర్ జాయ్ బొమ్మ ఎంత బాగుందో తెలుసా... మొన్న ఇంటర్వెల్‌లో సంచీలోంచి తీసి అందరికీ చూపించింది. నేను ఒక్కసారి ముట్టుకుంటానంటే గూడా ఇవ్వలేదు. వాళ్ళ నాన్న సరుకులకు పోయినప్పుడల్లా తెచ్చిస్తాడంట తెలుసా..." అంది పాప మనసులో దాచిపెట్టుకున్న కోరికను అణచిపెట్టుకోలేక.

సాయిరాంకి కొనియ్యలేని తన అశక్తతకు మనసు కళుక్కుమంది. "పోనీలే పాపం అని ఒకసారి కొనిచ్చినా పిల్లలు తృప్తిపడరు. మళ్ళా మళ్ళా అడుగుతూనే వుంటారు. అందుకే ముందే తమ శక్తికి మించిన వాటికి దూరంగా వుంటే పిల్లలు మొదట మారాం, చేసినా తరువాత చెప్పేది అర్థం చేసుకుంటారు" అనుకుంటూ పాప భుజంపై చేయివేస్తూ అనునయంగా.

"అదికాదమ్మా... ఏముంటాది చెప్పుదాంట్లో ఒక చిన్న బొమ్మ. క్రీంలో ముంచిన రెండు తియ్యని గుండ్లు. ఆ మాత్రం దానికి నలభై రూపాయలా... ఆ బొమ్మలన్నా ఆడుకోని దాచిపెట్టుకునేవా అంటే అదీ కాదు. పదినిమిషాల తరువాత వాటి ముఖం గూడా చూడరు. సరే ఆ తినేటివన్నా బాగుంటాయా అంటే అవీ అడికాడికే. పంటికిందకు గూడా ఆనవు. కావాలంటే వేరేవి కొనుక్కోండమ్మా... ఏ చాక్లెట్లో, బిస్కెట్లో..." అన్నాడు.

పాప మౌనంగా తలాడించింది. కానీ చిన్నోడు ఆ మాటలేవీ పట్టించుకోకుండా "నాన్నా... సూపర్‌జాయ్ కొనిస్తావా... కొనియ్యవా" అన్నాడు ముఖమంతా గంటుపెట్టుకొని అసహనంగా.

"డబ్బుల్లేవురా... అవి వచ్చేవారం కొనిస్తాలే" అన్నాడు సాయిరాం అనునయంగా. వాడక్కన్నించి ఒక్క ఇంచుగూడా పక్కకు కదల్లేదు. ముక్కుపుటలు కోపంతో అదురుతున్నాయి. పాప వాన్నే చూస్తావుంది. దాని కళ్ళలో ఏదో దింపుడు కళ్ళెం ఆశ మెరుస్తావుంది.

"అబద్దాలెందుకు చెబుతావ్. కనబడుతున్నాయిగదా డబ్బులు జేబులో" అన్నాడు గట్టిగా కాలు నేలమీద కేసి కొడుతూ. వానికి ఆ డబ్బులు ఎంత అవసరమో ఎలా చెప్పాలో సాయిరాంకి అర్థం కాలేదు.

అందుకే వాళ్ళను బడి దగ్గర వదలాలంటే సాయిరాంకి చాలా భయం. అదే వాళ్ళమ్మ వెంబడిపోతే కిక్కురుమనరు. కళ్ళతోనే కట్టడి చేసేస్తాది. ఆమె కసలు అంగళ్ళోని తినుబండారాలంటేనే అలర్జీ.

"ఏందా పనికిరాని చెత్త. ఎప్పుడో మూన్నెళ్ళ కిందటో, ఆర్నెళ్ళ కిందటో చేసిన సద్దివన్నీ... ఆరోగ్యాలు పాడుచేసే ఆ సన్నాసి ప్లాస్టిక్ కవర్లలో పెట్టి, చెడిపోకుండా నానా రసాయనాలు కలిపి, అన్ని ఛానెళ్ళలో పదే పదే ప్రకటనలు వేస్తూ... పసిపిల్లల లేత మనస్సులకు వల వేస్తుంటారు. చూడటానికి ఒకొక్కటి ఇంత లావుంటాయి గానీ కత్తిరిస్తే వుత్త గాలే. పట్టుమని పదిముక్కలు గూడా వుండవు. మీకు తినడానికి ఇంట్లోనే చేస్తాగదా... ఏం కావాల్నో చెప్పండి" అంటుంది.

పండుగరోజు గూడా తినుబండారాలు స్వగృహ సెంటర్లలో

# డిసెంబర్ నెల పురస్కారాలు





## విరిగిన కల

కథకు.......రూ.700/-

రచయిత : సిద్దెంకి యాదగిరి

## నన్ను దఫన్ చేయరూ..

కవితకు.......రూ.500/-

రచయిత : సాయిపద్మ

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

## దుఃఖానికో నిర్వచనం


ఎమ్వీ రామిరెడ్డి

✆ : 09866777870




గుండెల మీద
నిలువునా ఎండిన రేగుచెట్లు
గాయాలగాలి వీచినప్పుడల్లా
కరకరలాడే కంపనాలు
శరీరతీరాన ఎడారిగాలుల ఉప్పెన
గుండె గొంతుకలో
మొనదేలిన కత్తుల వంతెన
కాళ్ల చుట్టూ కఠిన శిలలు
చేతుల్నిండా తుమ్మముళ్ల రక్కుళ్లు
అంతా ఒక అరివీర భయంకర అగ్నికవాతు !
దుఃఖమే అంత
సతతహరితారణ్యాల్ని నిర్దాక్షిణ్యంగా నరికేసి
చంద్రనిప్పుల్ని చేతల్తో విసుర్తుంది
దేహం మీదికి !

---

తెచ్చుకునే ఈ రోజుల్లో పాపం కష్టపడి పిల్లల కోసం ఏవేవో చేస్తుంటాది. "ఎందుకే ఇంత కష్టమంటే... నవ్వేస్తూ.." ఆరోగ్యానికి ఆరోగ్యం. మిగులుకి మిగులు. మన సంపాదనకి ఆ పనికిరాని ఖర్చులు అవసరం లేదులే" అంటుంది.

"నాన్నా... కొనిస్తావా... కొనియ్యవా..." అనే చిన్నోని అరుపుతో సాయిరాం వులిక్కిపడ్డాడు. కొందరు ముందు పోతున్నా వాళ్ళు ఆగి వెనక్కి తిరిగి చూశారు.

సాయిరాంకి చాలా అవమానంగా అనిపించింది.

"ఏం చెప్తే అర్థం కాదా మరలా కొనిస్తానంటే... పదపద" అన్నాడు వాని భుజం మీద చేయి వేసి ముందుకు దొబ్బుతూ.

వాడు అంగుళం గూడా కదల్లేదు సరికదా... ఒక్కపెట్టున దిక్కులు పిక్కటిల్లేలా 'ఓ' అంటూ ఏడుపు అందుకున్నాడు. దారినపోయే కొందరు ఇవన్నీ మామూలే అన్నట్లు ముసి ముసిగా నవ్వుకుంటుంటే, మరికొందరు అదోలా చూస్తున్నారు. ఇంకొందరేమో "పిల్లోడు అడుగుతే ఆ మాత్రం కొనియ్యలేవా... ఏం మనిషివయ్యా నువ్వుచేతగాక పోతే ఎందుకు కన్నట్టో" అన్నట్లు అవహేళనగా చూస్తున్నారు.

సాయిరాంకి వాన్ని రోడ్డుమీదనే దనాదనామని నాలుగు పీకాలనిపించింది. కానీ వాడు మరింత గొడవ సృష్టిస్తాడు. అక్కన్నే కిందపడి గిలగిలా కొట్టుకోవడం, పుస్తకాలు విసిరి కొట్టడం చేస్తాడు. వాన్ని నడిబజారులో ఏమీ అనలేని చేతగానితనాన్ని ఆసరాగా తీసుకొని చిన్నోడు మరింతగా రెచ్చిపోతున్నాడు.

ఆ ఏడుపును ఆపలేక తన ఏడుపు దిగమింగుకుంటూ జేబులోకి చేయి పెట్టాడు. నెలాఖరి ఖర్చులకు దాచుకున్న చివరి వందరూపాయలు నవ్వుతూ వెక్కిరించింది.

ఒకటికొంటే కుదరదు. కొంటే ఇద్దరికీ కొనాలి ఒకొక్కటి నలభైరూపాయలు. రెండంటే ఎనభై.

గుండె కలుక్కుమంది. పళ్ళ బిగువున బాధను అణచిపెట్టుకుంటూ "సర్లే... ఇంక ముయ్యి. కొనిస్తాగానీ" అన్నాడు సాయిరాం వాడిపోయిన ముఖంతో అంగడివైపు అడుగులేస్తూ...

చిన్నోడి ముఖంలో ఏడుపు ఛటుక్కున ఆగిపోయింది. తన పాచిక పారినందుకు పాప ముఖం ఆనందంతో వెలిగిపోయింది.

అంగడిముందతా వరసగా
కొత్తగా మార్కెటులోకి అడుగుపెట్టిన ప్రతిదీ
రంగురంగుల ఆకర్షణీయమైన ప్లాస్టిక్ కవర్లలో
పసిపిల్లలను ఆకర్షిస్తూ... వూరిస్తూ... కవ్విస్తూ...

పిల్లలను కిడ్నాప్ చేసి డబ్బులు గుంజే మాయలమరాఠీల్లా విషపునవ్వులతో పరిహసిస్తున్నాయి.





# దాశరధి రంగాచార్య కథల్లో స్త్రీ పాత్రలు

టి. అన్నపూర్ణ
✆ 9912776182

దాశరధి రంగాచార్య మలితరం కథా రచయితలల్లో ఒక్కరు. వారి జీవితం - సాహిత్యం వేరుకాదు. ఒకే రంగానికి పరిమితం కాకుండా సామాజిక, సాంస్కృతిక, సాహిత్య రంగాలలో ఎప్పటికప్పుడు మార్పును తీసుకరావడానికై కృషిచేశారు.

దాశరధి సామాజిక దృక్కోణం నుండి వెలువడిన కథల సంపుటి "నల్లనాగు" ఈ సంపుటిలో మొత్తం 21 కథలున్నాయి. ఈ కథల నిండా సామాజిక వాస్తవికతే ఉంది.

"నల్లనాగు" కథా సంపుటిని పరిశీలించినప్పుడు కొన్ని (ఎనిమిది) కథల్లో చూస్తే అందంగా లేక ఆత్మన్యూనతతో బాధపడుతూ వివాహం విషయంలో సర్దుబాటుతత్వాన్ని అవలంభించే స్త్రీలు, కన్నపిల్లల మీదనే కాదు పిచ్చుకలు, కుక్కలు, మూగజీవాల మీద ప్రేమను కురిపించే భూతదయగల స్త్రీలు, కొడుకును యుద్ధానికి పంపించే వృద్ధ స్త్రీ, ఆకలికోసం శరీరాన్ని అమ్ముకున్నా మరొకరి ఆకలిని చూసి సహాయం చేసే యువతులు, స్వతంత్ర్య వ్యక్తిత్వం గల స్త్రీలు, ఆర్థిక లేమితో బాధపడినా వ్యక్తిత్వాన్ని కోల్పోని పనిమనుషులు, ఆకలిముందు అమ్మతనం అమ్ముడుపోయి మనస్థాపానికి గురైన తల్లులు, ఎలాగైనా జీవితాన్ని గెలుచుకోవాలనుకునే ఛాలెంజ్ మనస్తత్వం గల విద్యావంతులు, నమ్మినవారు వంచిస్తే ప్రతీకారం తీర్చుకున్న భార్యలు, రంగాచార్య కథల్లో కనిపిస్తారు.

"ప్రేమకథ"లో తల్లిదండ్రులు లేని మేరి నల్లగా ఉన్న కారణంగా యుక్తవయస్సు దాటినా కూడా వివాహానికి నోచుకోదు. తనను ఇష్టపడే ఏ మగవాడైనా ఫరవాలేదని సర్దుకు పోగలనని తోడు కోసం ఎదురుచూస్తున్న మేరి జీవితంలోకి రమేష్ అనే నిరుద్యోగి ప్రవేశిస్తాడు. రమేష్ మేరి నెలజీతాన్ని చూసి ఆమెతో జీవితం పంచుకోవాలనుకుంటాడు. రమేష్ కారణాలతో నిమిత్తం లేకుండా తనతో జీవితం పంచుకోవడానికి అతన్ని మనస్ఫూర్తిగా మేరి ఆహ్వానిస్తుంది.

స్త్రీ ఎప్పుడు పురుషుడు ఎవరని చూడదు. అతని నేపథ్యం ఆమెకు అవసరం లేదు. తనని ప్రేమిస్తే చాలు సొంతంగా జీవితాన్ని అర్పించే లక్షణముంటుందని మేరి ద్వారా రచయిత మనకు తెలియజేశాడు.

"జై జవాన్!"లో దేశం ఆపదలో ఉన్నప్పుడు దేశాన్ని కాపాడటం దేశభక్తుల బాధ్యత. జవాన్‌కైతే ఈ బాధ్యత మరింత ఉంటుంది.

"జై జవాన్" కథలో దేశభక్తుడైన జవాన్‌కు తల్లిగా ఉన్న వృద్ధ స్త్రీ మనో పరివర్తనను తెలుపుతుంది. వృద్ధాప్యంలో తనకు ఆసరగా, బాలింతగా ఉన్న కోడలుకు తోడుగా ఉండాల్సిన కొడుకు యుద్ధానికి వెళ్తానంటే మొదట నివారించింది. కానీ గ్రామంలోని దేశభక్తులు తన కొడుకు కర్తవ్యాన్ని గుర్తించి నినాదాలు చేస్తుంటే తన కొడుకు సేవలు కుటుంబానికే కాదు, దేశానికి మరింత అవసరమని భావించి యుద్ధానికి పంపిస్తుంది.

జవాన్ ఎంతటి దేశభక్తుడో ఆయనను కన్నతల్లి కూడా అంతటి దేశభక్తురాలే అని ఈ కథలోని వృద్ధ స్త్రీ పాత్ర ద్వారా తెలుస్తుంది.

"నవల" కథలో ఆకలి తీరడానికి అనివార్యంగా వేశ్యా వృత్తిని ఆశ్రయించే స్త్రీలో ఎంత మానవీయత ఉంటుందో "నవల" కథలోని వేశ్యా పాత్ర నిరూపిస్తుంది. తనతో గడిపితే వచ్చేరూపాయితో ఆకలి తీర్చుకోవచ్చని ప్రయత్నించిన వేశ్యకు ఎదురుగా ఉన్న రచయిత నుండి నిరుత్సాహమే ఎదురవుతుంది. కారణం రచయిత కూడా కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తూ, ఆకలితో బాధపడుతున్న వాడే కనుక. వేశ్య మరొకనితో గడిపి తనకొచ్చిన సొమ్ములో చిన్న మొత్తాన్ని ఆకలి తీర్చుకో

అంటూ రచయిత కివ్వడంతో ఆమె మానవీయత అతిశయిస్తుంది. సభ్య సమాజంలో బతుకుతున్నామనుకునే వ్యక్తుల కంటే నిరాపేక్షంగా ఎదుటివారి ఆకలిని తీర్చేందుకు సిద్ధపడిన వేశ్య మానవీయతలో ఎంతో ఎత్తుకు ఎదిగిందనిపిస్తుంది.

కటిక దారిద్ర్యంలో కూడా ఇతరులకు సహాయం చేయాలనే మనస్తత్వం కల్గిన వేశ్యలను ఉద్దేశించి ఈ కథలో తెలిపారు.

"పిచ్చుకలు", "కుక్కపిల్ల" ఈ రెండు కథల్లో సామాన్యమైన మధ్యతరగతి కుటుంబంలోని స్త్రీలు, పిల్లలతో పాటు పిచ్చుకలను ప్రేమగా చూసుకునే స్త్రీలు, అదే విధంగా కుక్కలను ప్రేమించే స్త్రీలు కుక్కలకు అన్ని పనులు చేస్తూ ఆనందించే స్త్రీలు, భూతదయ కల్గిన స్త్రీలు కనబడతారు.

మధ్యతరగతి కుటుంబంలోని పిల్లలకు ఆహారం సరిగ్గా ఉండక తిండికే ఇబ్బందిగా ఉన్నా మూగజీవాలను ప్రేమించే స్త్రీలు కూడా సమాజంలో ఉన్నారని ఈ రెండు కథల ద్వారా రచయిత తెలియజేశారు.

భార్య దగ్గర ఏకపత్నీవ్రతుడుగా ఫోజులిచ్చే భర్త, ముసుగులు ధరించి సంఘంలో పెద్ద మనుషులుగా ఫోజులు కొట్టే పురుషుల వికృత లక్షణాన్ని తెలిపే కథ నల్లనాగు. విశ్వనాధం తన పి.ఏ శర్మిల వైపు కన్నెత్తి కూడా చూడనని భార్యతో చెప్పి ఆమె హృదయంలో వ్యక్తిత్వం ఉన్న భర్తగా స్థానం సంపాదించాడు. భార్య ఇంట్లో లేని సమయంలో, ఏకాంతంలో పనిమనిషి నీలమణి పై మనస్సు పారేసుకొని దిగజారడానికి ప్రయత్నిస్తాడు. ఒక దశలో ఆమెతో పశువులా ప్రవర్తిస్తాడు. కానీ ఆమె పేరుకే పనిమనిషి. ఆర్థిక లేమితో ఉన్న నీలమణి పవిత్రమైన వ్యక్తిగా తనకు తాను నిరూపించుకుంటూ విశ్వనాధం ఎలాంటి సంస్కార హీనుడో వీధిలోకి గుంజి నలుగురి ముందు ధైర్యంగా బుద్ధిచెబుతుంది.

ఈ కథలో అమాయకంగా భర్త మాటలు నమ్మే భార్యగా సుజాత కన్పిస్తే, పేదరికంలోనైనా ఆత్మగౌరవంతో బతకాలని నిరూపించిన స్త్రీగా పనిమనిషి నీలమణి కనబడుతుంది.

"విలువలు వలువలు" కథలో ఆకలి ముందు అమ్మతనం అమ్ముడుపోయింది. కటిక దారిద్ర్యంతో పసికూన అయిన కొడుకుని భూస్వామికి తాకట్టుపెట్టింది. భర్త అకాల మరణానికి గురికావడంతో ఒంటరిదైన స్త్రీ తిరిగి దొరకమ్మిన కొడుకును తనకు వృద్ధాప్యంలో తోడుంటాడని ఆశపడింది. కానీ ఈ ఆశ అడియాశ అయిన స్థితి "విలువల వలువలు"లో కనబడుతుంది.

వీరను బాల్యంలోనే వెంకటయ్య దొరకు తల్లి అమ్మేస్తుంది. వెంకయ్య దొర దగ్గరనే కట్టుబానిసగా ఉన్న వీర యుక్త వయస్సుకు వచ్చాడు. తండ్రి మరణించాక తల్లి తిరిగి తనను తీసుకెళ్ళడానికి వస్తే దొర దగ్గర నుండి తిరిగి తల్లి దగ్గరకు వెళ్ళితే అన్నం దొరకదని భావించిన వీర తల్లి దగ్గరకు వెళ్ళడానికి ఇష్టపడడు.

ఈ కథలో వీర తల్లి పేదరికం వల్ల పేగుబంధాన్ని తెంచుకోవల్సిన అవసరం ఏర్పడిందని రచయిత తెలిపారు.

"అర్ధరాత్రి అరుణోదయం" కథలో ధన వ్యామోహంలో పడి ప్రేమ పేరుతో యువతులను వంచించి పెళ్ళి చేసుకొని తర్వాత భార్యనే అమ్మాలని చూసే వంచనా పూరితమైన భర్త, మోసపూరిత మనస్తత్వమున్న కొడుకుకు సహాయం చేసే తల్లి వృత్తాంతాన్ని తెలిపే కథ అర్ధరాత్రి అరుణోదయం.

ఈ కథలో రమణి అనే యువతి చిన్నతనంలో తండ్రిని కోల్పోయి తల్లి పెంపకంలో ఎదిగింది. శరత్తు అనే యువకుడు తాను ఒంటరినని, అనాథనని రమణిని నమ్మించి వివాహం చేసుకోవాలనుకుంటాడు. వీరి వివాహానికి అంగీకరించని రమణి తల్లిని బలవంతంగా ఒప్పించి కట్నకానుకలిచ్చి శరత్తును వివాహం చేసుకుంటుంది రమణి. కాపురం పెట్టాక శరత్తుకు ఓ తల్లి ఉందన్న వాస్తవం రమణికి తెలుస్తుంది. మొదటి నుండి శరత్తు తనను వంచిస్తున్నాడనే వాస్తవాన్ని చెబుతున్నా, తల్లిమాట విననందుకు రమణి బాధతో ఏడ్చింది. భర్త అత్తల వేధింపులకు తట్టుకోలేక తల్లి ఉంటున్న ఇల్లు కూడా అమ్మి డబ్బు తెచ్చి భర్త, అత్త చేతుల్లో పెట్టాక కూడా రమణి వేధింపులకు గురౌతూనే ఉంది. ధన పిశాచాలైన భర్త, అత్తలు తనను గృహంలో నిర్బంధించి తనకు కావలిగా చిత్తమ్మను ఉంచారు. అర్ధరాత్రి అరబ్బుషేక్‌కు తనను అమ్ముతున్నారని చిత్తమ్మ ద్వారా తెలుసుకున్న రమణి తీవ్ర మనస్థాపానికి గురౌతుంది. నరరూప రాక్షసులైన భర్త, అరబ్బు నుండి తనను తాను రక్షించుకోవలసిన అవసరం ఉందని రమణి అనుకుంటుంది.

తనను కొనడానికి అర్ధరాత్రి ఇంటికి వచ్చిన అరబ్బును, అమ్మడానికి సిద్ధపడ్డ భర్తను తలుపుతీసి లోపలికి వస్తుండగా తలుపుచాటున ఉన్న రమణి సాహసంతో రోకలితో తలలు పగలగొడుతుంది. ఆ దుర్మార్గుల ఎర్రని రక్తపు మడుగులోంచే ఈ అర్ధరాత్రి అరుణోదయం అయిందని తన చీకటి జీవితానికి ఇదే సూర్యోదయం అని రమణి భావించింది.

ఈ కథలో ఆపదలో ఉన్న స్త్రీ తనను తానే ఉద్ధరించుకునే సాహస నారీమణి కావాలని రచయిత ఉద్బోధించాడు.

ఈ కథల్లో రచయిత ప్రధానంగా స్త్రీ సమస్యలను చిత్రించకపోయినా కథలో అంతర్భాగంగా స్త్రీ స్థితి, గతిని చెబుతూ వచ్చాడు. అయితే వస్తు ప్రాధాన్యాన్ని బట్టి సంఘటన, నిర్మాణాన్ని బట్టి శిల్ప చాతుర్యాన్ని బట్టి ఈ కథల్లో స్త్రీ పతనాన్ని, ఔన్నత్యాన్ని తెలిపినట్లుగా మనం భావించవచ్చు. ❈

***

***ఈ కథల్లో రచయిత ప్రధానంగా స్త్రీ సమస్యలను చిత్రించకపోయినా కథలో అంతర్భాగంగా స్త్రీ స్థితి, గతిని చెబుతూ వచ్చాడు. అయితే వస్తు ప్రాధాన్యాన్ని బట్టి సంఘటన, నిర్మాణాన్ని బట్టి శిల్ప చాతుర్యాన్ని బట్టి ఈ కథల్లో స్త్రీ పతనాన్ని, ఔన్నత్యాన్ని తెలిపినట్లుగా మనం భావించవచ్చు.***

***

**రచయిత్రి ఫోను: 9912776182**

# గోరింటాకు చెబుతున్న కథ

డా. కత్తి పద్మారావు
✆ : 9849741695



ఒక మనిషిని మరో మనిషి
వీక్షించినపుడు
అనంత ప్రతిభలు ఆవిష్కృత మౌతాయి.
కాని, మనిషిని పాక్షిక దృష్టితో వీక్షిస్తే
ఎన్నో విలువలు కనుమరుగవుతాయి
ఆ కొల్లేరు సరస్సు చూడండి
ఖండాంతరాల్లోని పక్షులను
ఆకర్షించింది.
ఆ స్వచ్ఛమైన జలతరంగాల మీద
అవి నీటి బిందువులను
చుంబిస్తున్నాయి.
వాటి రెక్కల మీద రంగులు
నీటి చరియల్లో జారబడి
నేలకు రంగులు అద్దుతున్నాయి
ఆకాశానికి హద్దులు లేవు.
పక్షులు ఎంత దూరం వెళ్లినా
'వీసా'లు లేవు.
రంగు భేదాలు లేవు.
వాటికి సామ్రాజ్యాలు లేవు.
సమానత, సాధికారిత వాటి సొంతం.
పక్షుల మధ్యలో గుండె బాస వుంది.
ప్రకృతి విస్తృతంగా వుంది.
జీవులు సూక్ష్మంగా ఉన్నప్పుడే
భాష కవిత్వం అవుతుంది.
వీరి వ్యక్తావ్యక్తత అంతా
ఒక మార్మిక మాయాజాలం.
అవును!
ఆ ఉసిళ్ళు చూడండి
ఎంత చిక్కగా సవ్వడి చేస్తున్నాయో!
అడవిలో
సన్నగా పారుతున్న
సెలయేటి నీళ్లలో వున్న
ఔషధగుణాలు
జీవుల సజీవతకు నిదర్శనాలు
మనుషులు ఎందుకు
స్పష్టంగా మాట్లాడలేకపోతున్నారు?
స్వచ్ఛంగా జీవించలేకపోతున్నారు?
వీరి నవ్వుల్లో ఏవో అర్ధ సత్యాలున్నాయి.
తమకు తమను
విభేదించటం లేదుకదా
అవును
ఆ ఉసిరి చెట్టుకు కాయలు
గుత్తులు, గుత్తులుగా కాస్తాయి.
చెట్టు ఊపితే
ఆకులకంటే కాయలే ఎక్కువ
రాలుతున్నాయి.
ఆ చెట్టు సువాసన భరితమైంది.
అది నిజమే!
మనుషుల మాటల్లోనే కాదు,
శరీర నిర్మాణంలోను సౌగంధ్యం లేదు
పైపైన పూతలు
తలకు రంగులు
లిప్‌స్టిక్‌ల వల్ల ఏమివస్తుంది?
ఆ ఉసిరి, జామ, వేప
ఆకు ఎప్పుడైనా నమిలారా!
ఉదరంలోని పేగుల్లోనే కాదు,
పురుగుల గుంపులు.
మెదడుల్లోను నులిపురుగులున్నాయి
స్వచ్ఛమైన మాట పుట్టాలంటే
ప్రకృతిని ప్రేమించకుండా
నిన్ను నీవు ఎలా ప్రేమించుకోగలవు!
చిన్న గోరింటాకు చూడండి
ఆ చేతులనన్నీ పండిస్తుంది.
ముందు స్వార్థం వీడండి
జీవితం పండుతుంది.
ప్రేమ వికసిస్తుంది.
సమాజం
పునరుజ్జీవనమవుతుంది.

---

# ఉచిత వస్తువుల మాయ

హిందీ మూలం : రాజేశ్ జోషి
తెలుగు : వేదుల రామకృష్ణ

అవసరమైన వస్తువు కొనటానికి బజారుకి
వెళతాను
వారు నాకు ఉచితంగా ఇంకో వస్తువు
అంటకడతారు
ఆ వస్తువు నాకు అసలు అవసరం లేదు
కాని తీసుకోవటానికి నిరాకరించలేను కూడా
అంతే ఈ ఒక్క క్షణంలోనే దొరికిపోతాను
ఆ ఉచితం కొరకు అవసరమైన వస్తువుల మధ్య
కొంత స్థలం కల్పిస్తే
అవసరమైన వస్తువుల స్థలం కొంత
కుచించుకుపోతుంది
ఉచితం మన మానసిక బలహీనతని
పసికడుతుంది
లోభత్వం మెల్లగా కాళ్ళు చాపుతుంది
ఒక ఉచితం రెండో ఉచితాన్ని పిలుస్తుంది
రెండో ఉచితం మూడో ఉచితం కొరకు
స్థలం కల్పిస్తుంది
ఒకనాటికి ఆ స్థలమంతా
ఉచితాలతో నిండిపోతుంది



# సాహిత్యం - రాజకీయాలు

ఆర్వీయార్



**సాహిత్యం జీవిత దృక్పథాన్ని, తాత్విక దృష్టుల్ని ప్రతిఫలించకుండా యెప్పుడూ లేదు. ఓ కవిగాని, నవలా రచయిత గాని, సమాజంలో భాగమే. వ్యక్తిగా తను సమాజంలో భాగం కాబట్టి, సమాజం తన రచనల్లో ప్రతిఫలించడం సహజం. తమ తమ తాత్విక దృక్పథాల్ని అయా కళా కారులందరూ ప్రచారం చేసుకున్న మార్గాలే ఆ కళలు. సాహిత్యం అందుకు మినహాయింపుగా వుండదు.**

'సాహిత్యం - రాజకీయాలు' అని వక్తృత్వ పోటీలో అంశం లాగా ప్రతిపాదించడమే వివరణార్హమవుతుంది. సాహిత్యం - సామాజిక జీవితం, సాహిత్యం-కాలం, సాహిత్యం-ప్రేమ, సాహిత్యం-ప్రకృతి, సాహిత్యం-మానవత లాంటి అంశాలేవీ అలా అనిపించవు. సాహిత్యంలో అభ్యుదయ ఉద్భవింపజేసిన కొత్తలో రాజకీయాల్ని సంస్కృతీ వికాస దాయకమైన సాహిత్యంలోకి నెట్టుకొస్తున్నారని "పరిశుద్ధ సాహిత్యాత్ములు" మంట వెళ్ళగక్కేవారు. అంతకు ముందు ఎన్నడూ సాహిత్య పవిత్ర తీరానికి "రాజకీయ" "మకిలి" తగలనట్టు. సాహిత్యం సాంఘిక జీవితాన్ని ప్రతిబింబిస్తుంది. సాంఘిక జీవితంలో రాజకీయాలు అంతర్భాగం. ఏ తరహా రాజకీయాలు, ఏ రీతిలో ప్రభావం కలిగించేవి అన్నది వేరే చర్చనీయాంశం. సాహిత్యాన్ని రాజకీయం నుంచి విడదియ్యడం అనేది కుదరదు. అలాంటప్పుడు సాహిత్యంలోకి రాజకీయాల్ని నెట్టుకొస్తున్నారని విమర్శించడం యెందుకు? ఉక్రోషం వెళ్ళగక్కడం యెందుకు? యెందుకూ అంటే అవి సిద్ధాంతపరంగా వామపక్ష దృక్పథం అనిపిలిచే రాజకీయాలుగా వున్నవి కాబట్టి, యధాతథంగా వున్నదాన్ని నిలబెట్టి వుంచే రాజకీయం అయితే సరే కాని, దాని పునాదులు కదిలించే ఆలోచనలు కలిగించచూస్తే మాత్రం కొంపలంటుకుపోవు? అందుకని విమర్శలు, కళ్ళముందుకు రాజకీయాలు వున్నందుకు కాదు, సాంఘిక పరిస్థితుల్ని మార్చాలన్న రాజకీయాలకీ అయా తాత్విక దృక్పథాలకీ వున్న సంబంధమేంటో అని పరిశీలించడమే. సాహిత్యంలో సిద్ధాంతాలు - సాహిత్యం సిద్ధాంతాలు కాదు - ఎలా ప్రతిఫలిస్తున్నదీ పరిశీలించడమే.

సాహిత్యం జీవిత దృక్పథాన్ని తాత్విక దృష్టుల్ని ప్రతిఫలించకుండా యెప్పుడూ లేదు. ఓ కవిగాని, నవలా రచయిత గాని, సమాజంలో భాగమే. వ్యక్తిగా తను సమాజంలో భాగం కాబట్టి, సమాజం తన రచనల్లో ప్రతిఫలించడం సహజం. తమ తమ తాత్విక దృక్పథాల్ని అయా కళా కారులందరూ ప్రచారం చేసుకున్న మార్గాలే ఆ కళలు. సాహిత్యం అందుకు మినహాయింపుగా వుండదు. 'ఆల్ ఆర్ట్ ఈజ్ ప్రాపగాండా' అన్నారు. ప్రాపగాండా అన్న పదాన్ని చెడ్డ

సాహిత్య విమర్శకుడు, అనువాదకుడు ఆర్వీయార్‌గా ప్రాచుర్యం పొందిన ఆర్. వెంకటేశ్వరరావు (73) డిసెంబరు 15న కన్నుమూశారు. పశ్చిమగోదావరి జిల్లా పెద్దేవం ఆర్వీఆర్ జన్మస్థలం. మార్టేరులో పాఠశాల విద్యను పూర్తిచేసి కాకినాడలోని పి.ఆర్. ప్రభుత్వ కళాశాలలో ఇంటర్ చదివారు. విశాఖపట్నంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంగ్ల భాష, సాహిత్యాలతో బి.ఏ. ఆనర్స్‌ను చదివారు. 1960 నుండి అనేక ప్రభుత్వ కళాశాలల్లో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘంలో ఉపాధ్యక్షులుగా, కార్యదర్శిగా ఉన్నారు. 1981 నుండి 1991 వరకు సోవియట్ రష్యా రాజధాని మాస్కోలో 'రాదుగ' ప్రచురణాలయంలో తెలుగు అనువాదకులుగా పనిచేశారు. భారతదేశం తిరిగి వచ్చిన తర్వాత రాజోలు ప్రభుత్వ కళాశాలలో లెక్చరర్‌గా కొనసాగారు. నల్గొండ జిల్లా రామన్నపేటలోని ప్రభుత్వ కళాశాలలో ప్రిన్సిపాల్‌గా 1997లో పదవీ విరమణ చేశారు. ఆంధ్ర సాహిత్య చరిత్ర-సంస్కృతి, తెలుగు కవులు, తత్వశాస్త్ర మౌలిక సూత్రాలు, సాహిత్య తత్వం, యుగకర్త శ్రీశ్రీ, గతితార్కిక భౌతిక వాదం, హిందూమతం, కులవ్యవస్థ భారతీయ సంస్కృతి, ఉక్రేనియన్ జాతక కథలు, ఇంగ్లీషు-తెలుగు ప్యాకెట్ డిక్షనరీ, ఈజీ ఇంగ్లీషు స్పీకింగ్ కోర్స్, పనికొచ్చే ముక్క పిల్లలకే నా హృదయం అంకితం, తొలగిన స్వర్గం వంటి పలు పుస్తకాలను రాశారు. పులుపుల శివయ్య స్మారక పురస్కారం, ఏటుకూరి బలరామమూర్తి స్మారక పురస్కారం, తెలుగు భాషా కృషికి గాను అధికార భాషా సంఘం గౌరవ పురస్కారం, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి కీర్తి పురస్కారం అందుకున్నారు.

**అనువాద రచనకు గాను కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం**

కేంద్రసాహిత్య అకాడమీ ఆర్వీఆర్‌కు అనువాద రచనకు గాను పురస్కారం ప్రకటించింది. ఆర్వీఆర్ కన్నుమూసిన ఐదు రోజులకు డిసెంబరు 20న ఈ అవార్డు ప్రకటించటం విశేషం.

అర్థంలో వాడుతూ వుండడం యివాళ కనిపిస్తోంది. కాని ఒక మాధ్యమం ద్వారా భావాలని ప్రచారం చెయ్యడం అనే అర్థమే. అంచేత సకల రచనా వ్యాసంగమూ దేన్నో ప్రచారం చేస్తూనే వుంటుంది. ఓ రచయిత తను వున్న వాతావరణంతో సర్దుకుపోయి సానుభూతిగా వుండొచ్చు. లేదా దాన్ని వ్యతిరేకించి ఎదిరించవచ్చు. ఎలాగైనా దాని ప్రభావం వుండి తీరుతుంది. కళకు సాంఘిక ప్రయోజనం వుండి తీరుతుందనడం యిందువల్లనే.

మన తెలుగు సాహిత్యాన్నే తీసుకుంటే తొలి మహా కావ్యరచనకు దారితీసిన నేపథ్యమే "రాజకీయం"- ఒక సిద్ధాంత పునాది వుండడం వల్ల. అదేమిటి అంటే వైదిక మత పునరుద్ధరణ. బౌద్ధులు, జైనులు మొదలగు వేదనిరాకరణ వాదులు తమ తమ మతములలో జనులను జేర్చుకొనవలయునను ఉద్దేశముతో మాతృభాషలో గ్రంథములనేకములను వ్రాసి వ్యాప్తిని, ప్రసిద్ధిని వడసియున్నారు. బౌద్ధుల గ్రంథములు అనేకములు మాగధియను ప్రాకృత భాషలో వ్రాయబడి యుందుననేందుకు ఇది ఒక దృష్టాంతము. ఆంధ్రులలో అనేకులు బౌద్ధ, జైన మతములను గ్రహించినవారై బ్రాహ్మణ మతమును వినర్జించి యుండుట సుప్రసిద్ధము. అన్య మతముల నవలంభించిన వారే వానియందు అభిమానము కల్గినవారేమైనా యీ జనులు మరల హిందూ మతములలో చేరువారినిగా జేయవలసియున్నను, ఉన్న హిందువులు తమ వర్ణమును వదిలి పోయిందన్నట్లు ఉంచవలసియున్నను దేశ భాషా మూలక ప్రచురణము అనివార్యములయ్యెను. ఇది ఆంధ్రవాఙ్మయ సృష్టికి మూలకారణమని నా ఊహ.

"తమ మతమును రక్షించుకొనుటకును, దానితో బాటు అగ్రవర్ణుల అధికారమును పదిలపరుచుటకునై ప్రాచీన మత గ్రంథముల దేశ భాషలలోనికి పరివర్తింపచేసిరి. వర్ణాశ్రమ పరాయణులను తమపై ప్రయోగించిన దేశభాషా వాస్తవం. తామును ప్రయోగించ వలసిన వారైరి - ఋగ్వేదమును వివక్షతతో జదివిన వారు వర్ణ ధర్మముల నంగీకరింతురనుట నిశ్చితార్థము కాదు. కావున పంచమవేదమే ప్రయోజనకారియైన కృతి. అందువలన దానిని మొదట తెనిగించాలి." అని "పంచమవేదము తెనిగింపబడుటకు హేతువు" అన్న వ్యాసంలో కట్టమంచి రామలింగారెడ్డి గారు రాశారు. యిదే అభిప్రాయాన్ని డా॥ కొర్రపాటి శ్రీరామమూర్తిగారు యిలా వెళ్ళడించేరు, 'తనకు వోలె తన ప్రజలకును భారతమునందలి అభిప్రాయము వినుటకు అభిలాష కలుగవలయునని రాజరాజ నరేంద్రుని అంతర్యము. అనగా ప్రజలు బౌద్ధ మతావలంబులు, జైన మతావలంబులు కాకుండా బ్రాహ్మణ మతావలంబులు కావలయునని రాజ రాజ నరేంద్రుని ఆశయము.

"బౌద్ధ మతపరమైన ప్రాకృత భారతమును గాని జైనమత పరమైన కన్నడ భారతము గాని తెనుగన రచింపుమని రాజ రాజ నరేంద్రుడు ఆదేశింపలేదు. బ్రాహ్మణ మతపరమైన సంస్కృత భారతమునే తెనుగున రచింపుమని రాజ రాజ నరేంద్రుడు ఆజ్ఞాపించెను. కారణము, రాజ రాజ నరేంద్రుని బ్రాహ్మణ మతోద్ధరణ ప్రస్థానమునందు భారతాంధ్రీకరణ ప్రయత్నము భాగస్వామ్యము కలదనుటయే" (ఆంధ్ర మహాభారతా వతరణము - చారిత్రక నేపథ్యము) "వైదిక భారతాంధ్రీకరణమునకు మతోద్ధరణ ప్రయత్నముతో కూడ సంబంధమున్నదని ఊహించుకొనే అవకాశము కలుగుచున్నది" ('నన్నయభట్టు' వ్యాసం) అని దివాకర్ల వెంకటావధాని రాశారు. ఇందుకు దాఖలాగా మూలంలో లేని విషయాలని, తన రచనలో నన్నయ్యగారు వేదాలకి సంబంధించి, వేదోక్త విధులకు సంబంధించి, వేద వక్తలను ప్రశంసించడానికి సంబంధించి రాయడమే. దీనికి ఆయనే వివరణలు యిచ్చారు. మహాభారతం "వర్ణాశ్రమాచార ధర్మములుపదేశించ బరమ గురువైనది" అని మల్లాది సూర్యనారాయణ శాస్త్రి రాశారు. "కవిత్రయము వారే ఒక విధముగా తెనుగు దేశమందలి వర్ణాశ్రమాచార స్థిరతను నిలబెట్టుటకు ప్రచారము చేసినవారనవచ్చు" నని సురవరం ప్రతాపరెడ్డి రాశారు. వైదిక మత పునరుద్ధరణ యెందుకూ అంటే "జైన, శైవ, వైష్ణవ మతములు మూడింటిలోనూ కులభేధ నిర్మూలనము ఒక సామాన్య ధర్మముగా వ్యక్తమగుచున్నది". యిదీ ఆ నేపథ్యం.

అంచేత ప్రాచీన ధర్మాల్ని కొత్త ఆహార్యంతో ప్రజల మీద రుద్దడానికి చేసిన ప్రయత్నాలు రాజకీయమైనవే. ఆ ఉద్దేశంతో కళను ప్రచారంగా వాడుకోవడమూ అంతే.

చరిత్రలో సామాజిక పునాది మీద ఆధారపడని కళా దృక్పథం లేదు. కళలన్నిటిలాగానే సాహిత్యం సమాజం మీద ప్రభావం కలిగిస్తుంది. లూయీ టెంపుల్‌టిన్ ప్రిజన్‌లో వోల్టేర్ రూసోల రచనలు చూసేడట. "యీ యిద్దరూ ఫ్రాన్స్‌ని నాశనం చేశారని" నెత్తి కొట్టుకున్నట్టే. అంటే తన వంశాన్ని అని విల్ డ్యూరాంట్ జోడించేడు. అంటే సాహిత్యం - పుస్తకాలు - యెంతటి ప్రభావం కలిగిస్తాయో అదనంగా వివరించనక్కర్లేదు. సమాజం మారుతూ వుండటం - మారకుండా ఒక్కలాగానే ఉంటే, పాత తాత్విక దృష్టి చాటే సాహిత్యమే చాలు, కొత్త దాని అవసరం వుండదు - కొత్త సిద్ధాంతాలతో కొత్తదార్లు తెరుచుకుంటూ వుంటాయి. అంటే ప్రజల చైతన్యం ప్రవాహం లాగా వుంటుంది తప్ప చెరువులో నీటి లాగా వుండదు. ప్రజల చైతన్యం ప్రభావితం కావడానికి సాహిత్యం దోహదం చేస్తుందనడంలో సందేహం లేదు. అయితే ప్రజల కోసం భారతాన్ని ఆంధ్రీకరించి హైందవ ధర్మ, పునరుద్ధరణ జరిపించాలన్న గాఢమైన కోరిక

> వర్ణ వ్యవస్థ హెచ్చుతగ్గుల్ని నిలబెట్టి వుంచాలని చూసే ధర్మం మరోలా యెలా వుంటుంది. దాంతో సాహిత్యంలోనూ హెచ్చుతగ్గులు ప్రవేశించాయి. పై వర్గాల వినోదం కోసం ఉద్దేశించిన సాహిత్యం ప్రజల నుంచి దూరమైంది. సామాన్య జనం తమ కళల్ని తాము అభివృద్ధి చేసుకున్నారు. అవి వాళ్ళకి వినియోగపడినా జానపదం అనీ, పాటక జనాలకు సంబంధించింది అనీ పండిత వర్గాలు యీసడించుకున్నాయి.

వున్నంతగా ప్రజలకి వికాసం కలిగించాలన్న కోరిక అప్పట్లో లేదు. వుండడానికి అవకాశమూ లేదు. వర్ణ వ్యవస్థ హెచ్చుతగ్గుల్ని నిలబెట్టి వుంచాలని చూసే ధర్మం మరోలా యెలా వుంటుంది. దాంతో సాహిత్యంలోనూ హెచ్చుతగ్గులు ప్రవేశించాయి. పై వర్గాల వినోదం కోసం ఉద్దేశించిన సాహిత్యం ప్రజల నుంచి దూరమైంది. సామాన్య జనం తమ కళల్ని తాము అభివృద్ధి చేసుకున్నారు. అవి వాళ్ళకి వినియోగపడినా జానపదం అనీ, పాటక జనాలకు సంబంధించింది అనీ పండిత వర్గాలు యీసడించుకున్నాయి. 'సంస్కృతి' అనేది జానపదులకు అవసరం లేదన్న తీర్మానమూ వచ్చింది. "మానవ సమాజాలు సాంస్కృతిక మార్గాన అడుగు పెట్టినాక సామాన్య ప్రజలకు కళలు మధ్య యుగంలో వెళ్ళినంత దూరంగా మరెన్నడూ పోలేదు. ఇది ఎంత తీవ్రమైన సమస్య అయిందంటే సామాన్య ప్రజలు తమ కళలను తాము వేరేగా సృష్టించుకున్నారు. ఇవే జానపద కళలు, భాషా పాండిత్యమూ, అలంకార శాస్త్రాలూ, సాముగరిడీలు లేకుండా "అప్రయత్నంగా" ప్రజల నుంచి పుట్టుకు వచ్చిన యీ కళలలో మధ్యయుగపు సామాన్య ప్రజల జీవితం సమృద్ధిగా ప్రతిబింబించింది". (కొడవటిగంటి కుటుంబరావు, సంస్కృతి వ్యాసాలు, పేజీ 90)

అయితే ఆ కళలలో ప్రజల కష్టసుఖాలైతే ప్రతిబింబించేయి కాని జీవితం గురించిన అవగాహనా, యెలా మార్చుకోవాలన్న ఆలోచనా లేవు. వుండే అవకాశమూ లేదు. ఏమంటే ఫ్యూడల్ హెచ్చుతగ్గుల్ని గురించిన పరిశీలనే లేదు. ఆ వ్యవస్థ రాజకీయ తాత్వికత అదీ.

సాంఘిక సంబంధాలకి ఆధారం ఆస్తి సంబంధాలు. ఉన్నవాడు, లేనివాడు "ఆగర్భ శ్రీమంతుడు" దరిద్రనారాయణుడు అన్న విభజన ఆస్తి సంబంధాల స్వరూపాన్ని తెలియజేస్తుంది. యీ విభజనే ఉనికిలో ఉన్న వర్గాల విభజనను సూచిస్తుంది. ఆస్తి సంబంధాలు మారకుండా, వాటిని మార్చకుండా ఆదర్శ నినాదాలైన సమానత్వం లాంటివి యెలా సాధ్యపడతాయి? సమాజంలో ఫ్యూడల్ సంబంధాలకి స్వస్తి పలకగలిగిన పెట్టుబడిదారీ నాగరికత యీ మౌలిక ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయింది.

పెట్టుబడిదారీ నాగరికత ప్రవేశించాక పాత పద్ధతుల్ని ప్రశ్నించడం వచ్చింది. సోదరత్వం, సమానత్వం లాంటి నినాదాలు ఫ్రెంచి విప్లవం నుంచీ వచ్చేయి. ఫ్యూడల్ హెచ్చు తగ్గులకు వ్యతిరేకంగా సమానత్వం అన్న నినాదం యిచ్చేరు. కాని అది ఆచరణకు వచ్చే సాంఘిక సంబంధాల గురించిన ఆలోచన చెయ్యలేదు. సమాజ సంబంధాలు దేనిమీద ఆధారపడి యేర్పడతాయన్న పరిశీలన లేనపుడు యిలాంటి ఆలోచన యెలా వస్తుంది. సాంఘిక సంబంధాలకి ఆధారం ఆస్తి సంబంధాలు. ఉన్నవాడు, లేనివాడు "ఆగర్భ శ్రీమంతుడు" దరిద్రనారాయణుడు అన్న విభజన ఆస్తి సంబంధాల స్వరూపాన్ని తెలియజేస్తుంది. యీ విభజనే ఉనికిలో ఉన్న వర్గాల విభజనను సూచిస్తుంది. ఆస్తి సంబంధాలు మారకుండా, వాటిని మార్చకుండా ఆదర్శ నినాదాలైన సమానత్వం లాంటివి యెలా సాధ్యపడతాయి? సమాజంలో ఫ్యూడల్ సంబంధాలకి స్వస్తి పలకగలిగిన పెట్టుబడిదారీ నాగరికత యీ మౌలిక ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయింది. అందరూ వున్న వాళ్ళు అవడానికే తగ్గ సమానత్వం తెచ్చి పెట్టాం కదా, దాన్ని వాడుకుని మీ మీ ప్రయత్నాలు చేయండి అని చేతులు దులుపుకుంది. అవకాశం కల్పించినట్టు చాటుకునే సమానత్వం మౌలికంగా సమస్యకు దృష్టి మళ్ళించలేదు. ఫ్యూడల్ యుగంలో కంటే ఉత్పత్తి శక్తులు మారేయి కాని సంబంధాలు మారలేదు. "జన్మం, చర్మం వెనకి సంప్రదాయమూ నెరిపే అసమానత పనికిరాదు" అన్నారు. కాని అసమానతల బదులు డబ్బు అసమానతలు వచ్చి పడ్డాయి. అంతకు ముందులేని గుర్తింపు జానపద కళలకు వచ్చింది. కాని దాన్ని చూసే దృష్టిలో పెద్ద మార్పురాలేదు. పాపం, వాళ్ళదీ కళే. వాళ్ళకీ ఆర్తి వుంది. మమతలూ, మమకారాలూ వున్నాయి. ఎంకి నాయుడు బావ వున్నారు కారూ అంటూ పాత దృష్టి ప్రదర్శించేరు. కళల రూపాన్ని శాస్త్ర జ్ఞానం ఎంత వరకు మార్చగలదో మార్క్సిస్టు - లెనినిస్టు గతి తార్కిక భౌతిక వాదం నిరూపించినంతగా మరేదీ నిరూపించలేదు. దాన్ని మించిన సామాజిక శాస్త్రీయ దృక్కోణం ఇప్పటికీ రాలేదు". అని కొడవటిగంటి కుటుంబరావు "శాస్త్రమూ - కళ" అన్న వ్యాసంలో వివరించేరు.

సాంఘికంగా సామ్యవాద సిద్ధాంతం సమాజ సమస్యలకు పరిష్కారం చూపించింది. మార్క్సిస్టు తాత్విక భూమిక, 'విప్లవం' వల్ల పరిస్థితులు యెలా మూలమట్టంగా మారగలవో ఆచరణలో రష్యా, తూర్పు యూరప్ దేశాలు 20వ శతాబ్దిలో ప్రపంచ దేశాలకి చూపించేయి. ఆస్తి సంబంధాలని అలానే వుంచి సమానత్వం అని నినదిస్తే చాలదు. ఆస్తి మీద స్వంత స్వామ్యం పోవాలి. అప్పుడే ఏ రకమైన అదనపు విలువ దోపిడీకి అవకాశం లేకుండా సమానత్వం సిద్ధిస్తుంది అని రుజువు చెయ్యాలని నడుం కట్టేయి. అయితే ఆస్తి సంబంధాల ఆధిక్యం అలానే వుంచుకోవాలని చూసే రాజకీయాలు రంగప్రవేశం చేశాయి. అనేక సిద్ధాంత ప్రతిపాదనలతో ఆ రాజకీయాలు నడుస్తాయి. మార్క్సిస్టు సిద్ధాంత విమోచనా శక్తి యెంతటిదో తెలిసిన వర్గాలు సిద్ధాంతాల మాటున, మేధావులను బరిమీదకు వదలి విప్లవ శక్తుల్ని నిరోధించడానికి సామదానభేద దండోపాయాలనీ వాడేయి. అంతర్గత కారణాల వల్లనైతేనేం, బాహ్యకారణాల వల్లనైతేనేం సోవియట్ ప్రయోగం వెనక్కి తగ్గినప్పుడు యిక యీ వర్గాలకు అడ్డే లేకపోయింది. రాజకీయంగా తమకు ప్రస్తుతానికి అవరోధం లేకపోయిందని నిర్ధారణ అయ్యే ఆ రాజకీయపు యెత్తుగడల్ని సిద్ధాంతం రాజకీయ శక్తిగా పిలిచినంత కాలం సాహిత్య కళారూపాల ద్వారా వెలుతుర్లో ఫోకస్ కావాలని తపన పడ్డ బుద్ధిమంతులు విప్లవ నినాదాలే యిచ్చారు. జనం ఆ నినాదాలంటే చిందులు తొక్కేస్తున్నారు కదా! వాటినే అందిద్దాం అని అందుకు నడుం కట్టేరు. రాజకీయంగా వెనకడుగు పట్టగానే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని చరిత్రలో యింతకు ముందు మెన్రో సిద్ధాంతాల్ని "చవి చూసి" వదిలిపెట్టేసినట్లుగా వదిలిపెట్టే

'బుద్ధివైశాల్యం' ప్రదర్శిస్తున్నారు. పెట్టుబడిదారీ రాజకీయ వర్గాలు యిలాంటి అవకాశాల్ని ఆవగింజంత కూడా జారవిడుచుకోవు. మేధావుల "మెల్లుల్ని" తిప్పిన కళ సిద్ధాంత అతీతమైన భావనగా ఆధునికానంతర పోస్ట్ మోడర్న్ దృక్పథాన్ని ముందుకు తీసుకువచ్చేరు. ఏ సిద్ధాంతానికీ కట్టుబడి వుండకపోవడమే అసలైన జీవిత సిద్ధాంతం, అదే రాజకీయం, జీవిత వైరుధ్యాలు వర్గాల నుంచి పుట్టుకొస్తాయి. వర్గ చైతన్యం ఆ వర్గానికి వుండకపోవచ్చు గాని, వర్గ స్వభావం మాత్రం సహజంగానే వస్తుంది. వర్గ చైతన్యాన్ని కలిగించే ప్రయత్నమే సాహిత్యం, కళలు చెయ్యాలి. అలా యిరవయ్యవ శతాబ్దం ఆఖరు దశకందాకా ప్రయత్నాలు సాగేయి. సోషలిస్టు వ్యవస్థ పతనంతో పరిస్థితి మారింది. వర్గ ప్రాతిపదికన చైతన్య స్ఫూర్తి పొంది సాంఘిక సమస్యల పరిష్కారానికి ప్రయత్నించడం స్థానే, యితర పద్ధతుల్లో అస్తిత్వాన్ని గుర్తింపునీ సాధించే ఉద్యమాలకు అంకురార్పణ జరిగింది. దళిత సంఘాలు, స్త్రీవాద నినాదాలు మౌలిక సమస్యా పరిష్కారానికి వారి వెతికే వర్గ కోణం నుంచి కాక, ఆయా విభాగాల సమస్యలు వాటికిగా కేటాయింపై వున్నట్టుగా భావించి వాటి పరిష్కారం కోసం పరిశ్రమిస్తున్నాయి. మొత్తం సామాజిక విమోచనతోనే తమ విమోచనా ముడిపడివుందన్న స్పృహలోపించడమే యిందుకు కారణం. యిదొక్కటే కారణం, అతివాద ఉద్యమం కూడా వర్గ చైతన్య స్ఫూర్తి ప్రదాయక మార్గంలో పెడుతున్నట్లు కనిపించడం లేదు. యిది మరింత విస్తృత అంశమే కాబట్టి వివరమైన పరిశీలన చెయ్యాల్సి వుంది. కాని రాజకీయ ఎత్తుగడ నేపథ్యాన్ని బట్టి ఒక అంశంగా యిక్కడ ప్రస్తావించుకోవడం కోసమే యీ విషయాన్ని తేవడం.

సినిమాలలో 'విప్లవం' కళాత్మకంగా గ్లామరైజ్ అయింది. కాని విప్లవ చైతన్య స్ఫోరకంగా రూపొందలేదు. యీ నేపథ్యంలో ఫండమెంటలిస్ట్ భావాలు సంస్కృతిని పునరుద్ధరిస్తున్నట్టు జనాల్ని మభ్యపెడుతూ ముందుకు పోతున్నాయి. సాహిత్యం చైతన్యాన్ని ఉద్దీప్తం చెయ్యవలసిన బాధ్యతను మరోసారి గుర్తు చేసుకోవాలి. ప్రగతి కాముకులందరు ఏకం కావాల్సిన సమయం యిదే.

అయితే ఆధునికానంతర దశ పోస్ట్ మోడర్నిజం మాత్రం మేధావి వర్గాల అభిమాన "సిద్ధాంతం" అవుతుంది కాబట్టి దాన్ని ఆ స్థాయిలో పరిశీలించాల్సిన అవసరం వుంది. మేధావులకు సాధారణంగా "శాస్త్రీయ" దృక్కోణ పరిశీలనా తర్ఫీదు వుంటుంది. సాహిత్యంలో అదోత్యకమవనకమానదు. 'ఆధునికానంతర' వైఖరి "కొత్తమలుపు" యేమిటంటే ఆలోచనా విధానాన్ని సమాహారం చెయ్యకుండా లోనికి రావడం. ఏ సిద్ధాంతాన్ని ఆలంబన చేసుకోకుండా సమాజాన్ని అర్థం చేసుకో(ప్రయత్నించడం ఒక ఫాషన్ అవుతుంది. ఫాషన్లు అడుగడుక్కీ మారుతూ వుంటాయి. సోవియట్ పతనం తర్వాత యిలాంటి ఫాషన్ ధోరణి వచ్చింది. పోస్ట్ మోడర్నిజమ్‌కి ఒక నిర్దిష్ట చారిత్రక వైఖరి లేదు. అందుచేత పెట్టుబడిదారీ సమాజ వర్గ స్వభావాన్ని సైద్ధాంతికంగా పరిశీలించే శక్తి వుండదు. సోషలిజం వెనకడుగు వేసిన దశలో కనీసం తాత్కాలికంగా రాజకీయశక్తులు సామాజిక విమోచనకు అదిపనికి రాదని తీసి పారేస్తున్నాయి. పెట్టుబడిదారీ విధానాన్ని ఒక వ్యవస్థగా పరిశీలించడమూ లేదు. అలా పరిగణించకపోతే దాన్ని విమర్శించనూ లేరు, అర్థం చేసుకోనూలేరు. నూతన అవతారంలో పెట్టుబడిదారీ విధానం యెలా దోపిడీ సాగిస్తుందో తెలుసుకోలేకపోతే సమాజాన్ని మార్చాలన్న ఆలోచనే రాదు. అదే పెట్టుబడిదారీ వ్యవస్థ మనుగడకు ఆలంబన.

రాజకీయాలు అధికార దిశానిర్దేశం చేసేవే. స్వభావతః విభేదంలేని ఓ పక్షం అధికారంలో వుండవచ్చు. కాని రాజకీయాల వర్గ స్వభావం గురించిన చైతన్యం సిద్ధాంత అవగాహనను బట్టి వస్తుంది. అభ్యుదయ ప్రగతిశీల భావజాలం ప్రచారంలో వున్నప్పుడు ప్రజల్ని చైతన్యయుతంగా కార్యాచరణ పథం మీద నడిపించడం జరిగింది. అది మందగించినప్పుడే పెట్టుబడిదారీ విధానం ప్రత్యామ్నాయం లేనట్టు, పెట్టుబడిదారీ విధానమే స్థిర మనుగడ సాగించగలదన్న భావాలని ఫోకస్ చెయ్యడం జరుగుతుంది. పోస్ట్ మోడర్నిజం 1960లలో యువత మీద ప్రభావం కలిగించిన అస్తిత్వవాదం వంటిదని కొందరు భావిస్తున్నారు. అది తప్పు అని తేలిపోయింది. ఏమంటే అస్తిత్వవాదం ఒక తాత్విక భూమికతో వుండేది. ఆధునికానంతర ధోరణి అలాకాదు. రాజకీయ పరాజిత భావంతో నిరాశా నిస్పృహల కేసి చూపించి నిష్క్రియాపరత్వాన్ని ముందుకు తెస్తోంది. యీనాటి పెట్టుబడిదారీ విధానం రాజకీయ నిరుత్సాహాన్ని కలిగిస్తుంది. సమాజంలోని అట్టడుగు తరగతుల్ని రాజకీయ రహితం చేసే సంస్కృతే యీనాటి పెట్టుబడిదారీ విధాన రాజకీయం. యిదే సాహిత్యంలోనూ ద్యోతకమవుతుంది. విప్లవ సాహిత్యం కూడా చల్లారడంతో రాజకీయచైతన్యం రగిలించే శక్తి సన్నగిల్లింది. రెండు దశాబ్దాల నాడు వున్న పరిస్థితికీ యివాల్టి పరిస్థితికీ తేడా గమనిస్తే యీ విషయం తెలుస్తుంది. అడవిలో పోరాటాల్ని ప్రతిఫలించే నవలలూ, దళిత కవితలూ వెలువడుతూ వున్నా గొంతు నీరసంగానే వుంది. ప్రధాన వాహికగా కాక, అనేక పాయల్లో ఒక పాయగా పక్కనే వున్నట్టు కనిపిస్తోంది. సినిమాలలో 'విప్లవం' కళాత్మకంగా గ్లామరైజ్ అయింది. కాని విప్లవ చైతన్య స్ఫోరకంగా రూపొందలేదు. యీ నేపథ్యంలో ఫండమెంటలిస్ట్ భావాలు సంస్కృతిని పునరుద్ధరిస్తున్నట్టు జనాల్ని మభ్యపెడుతూ ముందుకు పోతున్నాయి. సాహిత్యం చైతన్యాన్ని ఉద్దీప్తం చెయ్యవలసిన బాధ్యతను మరోసారి గుర్తు చేసుకోవాలి. ప్రగతి కాముకులందరు ఏకం కావాల్సిన సమయం యిదే. సాహిత్యం ప్రతీప రాజకీయాల్ని ప్రతిఘటించి పురోగామి రాజకీయచైతన్యాన్ని రగిలించాలి.

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన సాహిత్య ప్రత్యేక సంచిక 'గమనం' ఏప్రిల్ 2001 నుండి)**



# రైలుకట్ట గుడిసె !

- బి.వి. వెంకట్రావు

✆: 9440672229



రెల్లులు పూసిన పునాదుల్లా
తన అస్తిత్వపు మూలాల్ని వెదుక్కొంటోన్న
గడపలేని ఆగుడిసె ముంగిట్లో
అడుగిడిన ఆ నవవధువు
ఊరిజ్ఞాపకాలతో ఉబికుబికి వస్తోన్న
కన్నీటి చెలమల్ని తుడుచుకుంటూ
నీకు తోడు నేనున్నానంటూ-
గుడిసె ప్రక్కగా సాగిపోయిన
ఓదార్పులు రైలుబండి నేస్తం !

* * *

గమన శీలతా చైతన్య దీపికలతో
చీకటి పరదాలను చీల్చుకుంటూ
వేకువ పిట్టలా పట్టాల వెంట పరుగులు తీసే
తొలి బండి కూతకి
బ్రతుకు బరువు తలకెత్తుకుంటే
ఏ ముని మాపు వేళల్లోనో - మళ్లీదించుకొనేది
మధ్యాహ్నం బండి కూతకే
బ్రతుకు బండి ఎండిన డొక్కల్లో
గుప్పెడు ఇంధనాన్ని గుమ్మరించేది
పొద్దుఛాయలు, గడియారపు మాయలు తెలియని
గుడిశె బ్రతుకులో
మమేకమైపోయిన పొగ గడియారం !

* * *

పేగుల వాగుల్లో ప్రజ్వలించిన
ఆకటి కార్చిచ్చుల హాహాకారాల్ని,
రాకాసి హస్తాల ప్రొక్లెయినర్లు
భూదేవి గర్భాన్ని దేవేస్తోన్నట్లు
పురుడు పోస్తున్న నాటు మంత్రసాని
భీకర కర విన్యాసాలకు తాళలేక చేసిన
ఆక్రందనల్ని విన్నా-
ఏనాడూ తన రైలు నేస్తం
ఆగి ఆలకించిందీ లేదు
ఏ పట్నపు ఆసుపత్రికో చేర్చి
సేదదీర్చిందీ లేదు

* * *

విజ్ఞానం మీటిన వింత శృతుల్లో
బొగ్గు బండి కరెంటు రైలులా మారితే
కాలం ఆలపించిన కన్నీటి రాగంలో
తడిసిముద్దై, గుడిసె పంజరంలో
గువ్వలా ఒదిగిన వెలుగు దివ్వె
కాంతిహీనమై, అవ్వలా మారి,
బుక్కెడు బువ్వకోసం,
గుప్పెడు ఆదరణకోసం - ఎదురుచూపులు
తలోదిక్కూ ఎగిరెళ్లిపోయిన
తన బిడ్డల్ని ఏనాటికైనా చెంతకి చేరుస్తుందని
ఎడతెగని నిరీక్షణ.
కాని- ఊర్లోని చెత్తంతా ఊడ్చేసి
పొలిమేరల్లో పోగేసిన తన చెత్తకుప్ప గుడిశె
ఎటూ కానిచోట కళ్ళుతెరచిన
ఓ అనాధ శిశువని- ఆ అవ్వకు తెలియదు
జాతి జనుల భారాన్ని మోస్తూ,
తన కూతల మోతల చైతన్య శంఖారావంతో
జాతి మొత్తాన్ని జాగృతం చేస్తోన్న
ఆ ఊసరవెల్లి రైలుబండికీ తెలియదు -
గుడిసె గుండెలయ ఒడిసి పట్టుకుంటేనే
తన జాతి జాగృతమౌతుందని.

♦

కథ

ఎస్. బాలసుధాకర్ మౌళి
✆: 9848425039



# మానిగంప

ఎండ సురసురలాడుతుంది.

గాలి వెచ్చగా కొడుతూ... పరిసరాలను వేడెక్కిస్తుంది. వేడి గాలికి... చెట్ల మీద ఆకులు పరపరమని చప్పుడు చేస్తూ.. అటు ఇటూ కదులుతున్నాయి.

పండగ వెళ్ళి నెల రోజులు అయిందో, లేదో గానీ... ఊరిలో మనిషే లేనట్లు గొడ్డు గాసిపోయింది.

తెల్లారి తొమ్మిదయ్యిందంటే చాలు. వీధిలో పిట్ట మనిషి పికర గావట్లేదు. ఎండకి భయపడి ఎవరింట్లో వాళ్ళే వుండిపోతున్నారు.
మూగజీవాలు కూడా కనిపించడం మానేసి... ఏ చెట్లు కిందనో, గోలి సందుల్లోనో, చెరువుల్లోనో 'అలసట' తీర్చుకుంటున్నాయి.
కాకులన్నా ఊరిపట్టునుండేవి. అవి కూడా లేవు. సేద తీరడానికి దగ్గర్లో వున్న కొండకాసి వెళ్ళిపోతున్నాయి.
ఇన్నాళ్ళూ శ్రమ చేసి.... బడలిక మరచిపోయి, హుషారుగా పొలాల్లో పనిచేసే రైతులు కూడా...
ఎండ – ఒంట్లో నీరుని ఆర్చేస్తుంటే... పలుగూ, పారలను పక్కన పడేసి పదకొండింటికే అంబలేళయినట్లు ... తిల్లుకు తయారయ్యిపోతున్నారు.
పండు మిరపగాయల్లా... సిమసిమలాడుతూ ఎండ ఎర్రగా కాస్తుంది.
'కుండలోయ్... కుండలు... కుండలమ్మా కుండలు... మట్టి కుండలోయ్...' కుమ్మరి ఈరన్న.
పొగలు కక్కుతున్న అంత ఎదర ఎండలోనూ వీధి వీధంతా తిరుగుతూ... పెద్దగా కేకలేస్తున్నాడు.

'వడ్రంగి పైడితల్లి దుఖానం' ముందు నుంచి నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ వెళుతున్నాడు.

పైడి తల్లి చేతిలోని రంపం... ఫర్ ఫర్‌మని శబ్దం చేస్తూ... పొట్టును... చెక్క నుంచి వేరుచేస్తుంది.
పక్కనే బురదగుంటలో పందులు... వేసవి ఎండకి తాళలేక అటూ ఇటూ పొర్లుతున్నాయి.
సూరీడు ఎర్రగా మండుతున్నాడు.
ఈరన్న – నెత్తి మీద మూడు కుండలు, చేతిలో రెండు కుండలతో బరువుగా కదులుతూ... వీధి సందుల్లో కొచ్చాడు.
సారె మీద అందంగా రూపు దిద్దుకోనొచ్చిన కుండల్ని... అంతే నాజూగ్గా పట్టుకుని వీధిలెంబటి నడుస్తున్నాడు. కుండల పరిమాణం బట్టి రూపాయి ముచ్చావక్కనీ, రెండు రూపాయలకనీ... అమ్ముతాడు. వారం వారంకి రెండు రోజులు లెక్కని... పక్క పక్క ఊర్లు, గిరిజన గూడెంలు కూడా తిరిగి అమ్ముతుంటాడు.
"కుండలోయ్... కుండలమ్మా!"
పక్క వీధి మూల సందు తిరిగి... నాయుడు గారి ఇంటి దొడ్డెంబటి... సన్నటి నీడలాగా... సాగి సాగి ఆగాడు.
"ఒరే.... ఈరన్నా!" నాయుడు గారి భార్య పిలుపు విని దగ్గరకు వెళ్ళాడు.
చేతిలో కుండల్ని, నెత్తి మీద కుండల్ని కిందకి దించబెట్టాడు.
నాయుడుగారి భార్య – ఒక్కొక్క కుండని అటూ ఇటూ తిప్పి... కిందా మీదా చూసి... మట్టు బాగోలేదనో, అంచు ఒంపయ్యిందనో ఫిర్యాదు చేసి....

"అది కాదుగానీ.... ఒరే ఈరన్నా! నాలుగు మంచి పూలకుండీలుంటే రేపొచ్చినప్పుడు పట్రారా...! పట్నంలో కుండీలు మరీ ఖరీదెక్కువట...! అమ్మాయిగారు గులాబీలు, చేమంతులు వేసుకోవాలని సరదా పడతన్నారు..."

అని చెప్పి తిప్పి పంపేసింది.

నెత్తి మీద బరువు తగ్గుతుందని ఆశపడ్డ ఈరన్న...



మళ్ళీ సుమ్మగుడ్డ సుట్టుకుని... నెత్తి మీద పెట్టుకుని... కుండల్ని తీసుకుని బయలుదేరాడు.

మరి రెండు వీధులు తిరిగాడు.

"కుండలోయ్... కుండలమ్మా! కుండలూ...!" కేకేస్తున్నాడు.

కుమ్మరి వీధి, కంసాలి వీధి, నాయుడు వీధి దాటేసి... బజారు వీధిలోకొచ్చిపడ్డాడు.

తెల్లారనగా వచ్చాడు. ఒక కుండా చెల్లకపోయేసరికి... ఈరన్నకి చిరాకేసింది. చిరాకులో జీవితమంటే అసహ్యమేసింది.

"ఛ... కుమ్మరోడి బతుకు... కూటికి సేతులూ... కాటికి కాలులాగా తయారయ్యింది. మెడజివ్వలులా గీసినట్టు... ఊరంతా గానుగెద్దులా తిరిగినా రెండు రూపాయలు కానుతున్నాయి గాదు... ఛ... ఛ... ఏం బతుకో... ఏటో! గొణుక్కున్నాడు.

చింతనిప్పుల్లాంటి కంకర పిక్కలు కాళ్ళకు తగిలి... కాళ్ళు ఎరుపెక్కేయి. ఒళ్ళంతా చెమటలు పట్టేసి 'మట్టివాసన' వస్తూంది. ఖద్దరు లాల్చీ.. చెమటకు తడిసి శరీరానికి అతక్కుపోయింది.

సూరీడు నెత్తిమీదకొచ్చాడు. ఎండ సుర్రుమని తగులుతుంది.

ఈరన్న అరుస్తున్నాడు.

'కుండలోయ్... కుండలూ...' తిరిగి తిరిగి ఊరి చివర వీధిలో గల నూకాలమ్మ ఇంటి ముందుకొచ్చి ఆగాడు.

నూకాలమ్మది పూరిల్లు.

గుమ్మంలో పొయ్యి దగ్గర కూర్చుని... బియ్యం ఉడికిస్తూ మంట ఎగేస్తున్న నూకాలమ్మ... ముంజూర్లు నుంచి ఈరన్నని చూసి..

"రా...రా... ఈరన్నా... ఎండలో వుండిపోనావేటి! బాగున్నావా.... ఏటి, యెంత భేరం సేసేవేటి....

మా వొదిన బాగుందా... నయనా కాలూ సేతులూ ఆడించి... అటూ ఇటూ తిరుగుతండా!

అమ్మెలాగుంది"

బాగోగులు అడిగింది.

ఈరన్న... ముంజూర్లు దగ్గరే కుండల్ని దించి... లోపల కొచ్చి నేల మీద చతికిలబడ్డాడు.

ఏటి బాగుండడవమ్మీ...! నీకు తెలీందేటి... నాను కట్టబడితే గదా... ఇల్లు గట్టెక్కేది. మీ వొదినుండంటే... అదేనా ఎంత లెక్క తిరుగుతాది... అసలే ఎండ మాడ్సితంది..." చెప్తున్నాడు.

నూకాలమ్మ వింటోంది.

"ఇదిగో ఈ ఎండలో పడి నీరసమొత్తుందనుకో... ఏటంతే... ఏటి సెప్పడం...! ఈధిలోకొచ్చి నాలుగు గంటలవుతుంది.

...వొక్క కుండ సెల్లితే ఒట్టు... తల పేణం తోక్కొతుంది... పూట పూటకి కడుపుకి మట్టే బుక్కుతన్నాం. అలాగుంది మా గతి"

బాధని వెళ్ళగక్కాడు.

పొయ్యి మీద నుంచి కుతకుతమంటున్న కూటి కుండని కిందకి దించి... గెంజి దాకలో గెంజి వార్చి... కాసిన్ని గెంజి నీళ్ళు, అన్నం మెతుకులు పల్లెంలో పెట్టి ఈరన్నకి అందించింది నూకాలమ్మ.

ఈరన్న తాగి.... నిమ్మళించాడు.

నూకాలమ్మ... పొయ్యిలో కాగుతున్న కట్టెలని బయటకు తీసి... వాటి మీద నీళ్ళు చిమ్మరించి... పొయ్యి బుగ్గి ఒక పక్కకి కూడబెట్టి... గుండారా సద్దుకుని కూర్చుంది. గదిలో.. కాలిన పొయ్యి నుంచి ఆవిర్లు వెచ్చగా పరుగెడుతున్నాయి.

నూకాలమ్మ - చెంగుతో గాలిని ముఖానికి విసురుకుంటుంది. విసురుకుంటూ...

"ఒరే... ఈరన్నా! అందరి బతుకూ అలాగే ఏడత్తందిరా... మీ బావ పోయిన కాంచి... నా బతుకు మరీ అద్దూనం అయిపోనాది. పూటకి బుక్కెడు మెతుకులకి దిక్కుంటది గాదు.

వెదురు ఏసినోడు నేడు. బుట్టలు, సాపలూ అమ్మకమూ... నేడు. ఎవులు కొంతున్నార్రా యిప్పుడు....!" అంది

"అంతేను లాగుందమ్మీ...!" అంటూ

గోడవారగా చేరబడి చిన్న కునుకు తీసాడు ఈరన్న.

నూకాలమ్మ పెనిమిటి పేరు 'రామస్వామి'.

మేదర వృత్తి.

ఎగువ గిరిజనుల దగ్గర 'వెదురు' కొని బుట్టలు, చాపలు, చేటలూ, సిబ్బిలూ... అల్లి.. వీధిలో అమ్మేవాడు.

నూకాలమ్మకు... రెండో మూడో... మేదర కత్తితో బద్దను గీకడం... అల్లడం లాంటి పనులు వచ్చు గానీ పూర్తి వృత్తి రాదు.

భర్త పోయినప్పటి నుంచి... కనికరించి.. ఎవరైనా పిలిస్తే కూలికి వెళుతుంది... వచ్చిన పదో, ఇరవైతోనో కడుపు నింపుకుంటుంది.

రామస్వామి కన్నా ముందే... ఒక్కగానొక్క కొడుకు కులవృత్తి చేస్తుండగా.. పాదం మీద కత్తిపడి పుండు అయ్యి... మాదుగామారి... చనిపోయాడు.

నూకాలమ్మిప్పుడు ఒంటరిగా వుంటుంది. ఈరన్న, నూకాలమ్మకు అన్నయ్యలాంటోడు. ఒకరి కష్టాన్ని ఒకరికి చెప్పుకుని... ఆ మాత్రమైనా.. బతుకు మీద ఆశని నిలుపుకుంటున్నారు.

రామస్వామి, ఈరన్న కూడా మంచి స్నేహితులు.. మంచి వయసు మీదున్నప్పుడు ఎవరి వృత్తుల్లో వాళ్ళు బాగా రాణించారు.

వృత్తి నుంచి కడుపు నిండే దారి రాను రాను మూసుకుపోయేసరికి రామస్వామి మనో వ్యాధితో మంచంపట్టి ప్రాణం వదిలేశాడు.

రామస్వామిని తలుచుకుంటూ... తలుచుకుంటూ నిద్రపోయిన ఈరన్నకు మగత నిద్రలో 'చాపలు అల్లుతున్న రామస్వామి' కళ్ళముందు కనిపించేసరికి... తుళ్ళిపడి లేచి దోకుడు నీళ్ళు తాగాడు.

నిద్రపట్టలేదు.

మిట్ట మధ్యాహ్నపు 'ఎసర గాలి' వెచ్చగా లోపలికి కొడతంది.

నుదుట మీద పట్టిన చెమట బిందువులు. గుండెల్లో బాధని బయటకు వెళ్ళగక్కుతున్నట్లున్నాయి. అవి నెమ్మదిగా మెడ కింద నుంచి జారి గుండెల మీదనే ఇంకిపోతున్నాయి.

ఈరన్న పరాకులో నూకాలమ్మతో చెప్తున్నాడు.

"ఆ... రామిసోమిగాడి సెయ్యి సలవ ఏటో గానీ.. ఆడు అందంగా అల్లిచ్చిన 'మానిగంప' నిండా... మూడు, నాలుగు పుంజీల కూటి కుండలు, సేరదాకలు,. గెంజి దాకలు, నూని బుంగలు, పొయ్యిలు, ఉండీ పిడతలు ఏసుకుని.. ఈథిల్లోకొత్తే... రెండు సిటాల్లోనే సెల్లిపోయేవి. ఇప్పుడు రోజులు మారిపోనాయి.

సంసారులు కూడా పంటలు అలికిరయినప్పుడు... కూటికుండకు కుంచుడు సోలు లెక్కా, దాకకు కొడల్లు ఊదలు లెక్కా ఇచ్చీవోరు. ఇప్పుడదీ పోనాది."

మారుతున్న బతుకులకు ప్రతిబింబంగా వున్న నూకాలమ్మ... ఊ... కొడుతుంది. 'ఊ' కొడుతూ...

"నేనంతన్నానని నువ్వేటంతే అనుకోగానీ... ఒరే ఈరన్నా... కులవృత్తులు మానీసి... కూలికో. నాలికో ఎలిపోతే... బతికినన్నాళ్ళూ కడుపుకి గెంజి నీళ్ళకైనా ఓసిపోము గదరా... ఈ కాలంలో వృత్తిని నమ్ముకుని బతుకుని యెలగ బెడదామంతే నట్టేట్లో మునిగీతేరా....."

తేల్చేసింది.

ఈరన్న మౌనంలో కూరుకుపోయాడు.

కూడబెట్టిన పొయ్యి బుగ్గి - గాలికి ఎగిరి కళ్ళల్లో పడతంది.

నూకాలమ్మ చెంగున కట్టిన ఐదు ఇచ్చు రూపాయలు తీసి... "ఇదా ఈ ఐదు రూపాయలుంచు... అవసరం పడినప్పుడు దాకలో, బుంగలో యిద్దావులే..." అని ఈరన్న చేతిలో పెట్టింది.

సూరీడు చల్లబడ్డాడు.

ఈరన్న కుండల్ని తీసుకుని బయలుదేరాడు.

రెండు మూడు వీధులు తిరిగాడు. కుండల్ని ఎవరూ కొనలేదు. చేసేదేమీ లేక.. ఊరికి ఆ చివరన... శివాలయం వైపున్న ఇంటికి బయలుదేరేశాడు.

'పడమటి చీకటి తెరలు' నెమ్మదిగా పరచుకుంటున్నాయి.

ఇంటికి చేరిన ఈరన్న... గుమ్మంలో కుండల్ని దించి చతికిలబడ్డాడు. చల్లదనానికి... సగం ఎండి, సగం తడిగా వున్న మట్టి ముద్దల మీద కుక్కలు సేదతీరుతుంటే... కోపంతో కర్రందుకుని... నడ్డి మీద రెండు తగిలించాడు.

'కయ్...కయ్‌మంటూ...' అవి దూరంగా పారిపోయాయి.

గుమ్మంలో ఓ మూల నులకమంచం మీద నాయన 'గంగయ్య' క్షయవ్యాధితో బాధపడుతూ... పక్కన అమ్మ 'సత్తెమ్మ' పెనిమిటికి సేవ చేస్తూ..

ఈరన్న తెచ్చింది... ఇంట నలుగురు తిండానికే చాలదు. ఇంక ఆరోగ్యం మాట దేవుడెరుగు!

ఈరన్న భార్య తవుడమ్మ - అగ్గి రాజబెట్టి... అన్నం వండింది. మధ్యాహ్నం చారుంటే... పక్కన పెట్టింది. అత్తా మామలకు చెరో గిన్నెలో వేసి అందించింది.

ఈరన్న రెండు బుక్కలు తినీ తిననట్లు తిని... చేతులు కడుక్కుని... ఆ పూట అయిందనిపించాడు.

పాత చీరగుడ్డ నేల మీద పరచుకుని... చేరబడి... ఆలోచనల్లో పడ్డాడు. ఈరన్న పక్కనే చేరబడిన తవుడమ్మ...

"కుండలు సెల్లినాయా...." అని అడిగింది.

ఈరన్న పెదవి విరిచి.... "ఆ.... రామిసోమిగాడి భార్య... నూకాలమ్మ సెల్లిలాంటిది కాబట్టి మన బాధ సూడలేక ఇదా! ఈ ఐదు రూపాయలు సేతిలో ఎట్టింది -

ఈ ఊర్లో మనకిక జరుగుబాటు నేదే... నెత్తిన శెని కూకుంతే... మనమేటి సెయ్యగలం.

అనుకుంతాం గానీ... కుండల పని జరక్క 'ఇటికి పని'కి పట్నం ఎలిపోయిన కుమ్మర్లు ఎందరు నేరు...!? మన పిల్లలు గనక మనకాడ వున్నారేటి... రెక్కలొచ్చి యెగిరిపోనేదూ...''

నాల్రోజుల నుంచి పట్నం పోదామనే ఆలోచన బుర్రని జోరీగలా తినేస్తుంటే.. చివరకు మనసులో వున్నది భార్య ముందు పెట్టాడు ఈరన్న.

భర్త కష్టాన్నెరిగిన తవుడమ్మ... ఏమీ మాట్లాడలేకపోయింది.

ఆ రాత్రి... చల్లని మట్టిపడకపై అంతే చల్లగా వాళ్ళకి నిద్రపట్టేసింది.

ఇంటి పక్కన దొంకల్నుంచి... కీచురాళ్ళ రొద మాత్రం.... తెల్లార్లూ... గుండె అలజడిని బాహ్య ప్రపంచానికి చెబుతున్నట్లు వినిపిస్తూనే వుంది.

తెల్లారింది.

రాత్రి మట్టిముద్దల మీద సేదదీరిన కుక్కలు... మళ్ళీ అక్కడే కనిపించాయి.



"కుండలకి పనికిరాకపోయినా... కుక్కలకేనా ఉపయోగపడింది కదా... మట్టి తల్లి" అని కుక్కల్ని దమాయించక ఊరుకున్నాడు ఈరన్న.

ఊరికి అటు చివరనున్న 'కారి చెరువు' దగ్గర నుంచి మట్టిని కావుల్లతో పెరిగి... ఇంటి ముందు కుప్పలు వేసుకుంటారు కుమ్మర్లు. వర్షాకాలంలో... చినుకులు తగిలి మట్టి నీర్రై పోకుండా... ఆ కుప్పల్నే తీసుకెళ్ళి గుమ్మంలో పెట్టుకుంటారు

మట్టి వాసనన్నా, మట్టి స్పర్శ అన్నా కుమ్మర్లకి ప్రాణం.

కడుపుకి తిండి పెట్టి... ఇంటిని ఆదుకునేది... ఆ మట్టి ముద్దే కదా! మట్టికి దణ్ణం పెట్టుకోనిదే... ఏ పనీ మొదలు పెట్టడు ఈరన్న.

ఆ రోజు కూడా...

ఈరన్న కొద్దిగా సల్దికూడు తిని... ఎండిపోతున్న మట్టి కుప్పల కాసి ఆర్ద్రంగా చూస్తూ... నాలుగు పూలకుండీలు తీసుకుని వీధిలోకెళ్ళాడు.

'నాలుగు పూలకండీలూ తీసుకుంటానన్న...! నాయుడిగారి భార్య "ఇప్పటికి ఒకటి చాలురా... ఈరన్నా!" అని చెప్పి ఒక్కటే తీసుకుంది.

మిగిలిన పూలకుండీలను అమ్మాలని... నాలుగు వీధులు తిరిగి... అరిసి... అరిసి... అరుపులకు కష్టం చెల్లకపోయేసరికి మధ్యాహ్నం అవకముందే ఇంటికి తిరుగుముఖం పట్టేసాడు.

ఇంటికి చేరిన ఈరన్నకి భార్య కనిపించలేదు. 'అవునే ! తవుడూ ... యెక్కడే... ఎవులింటికెల్లి కూకుండిపోనావే...! వాసంతటికీ వినబడేటట్టు గట్టిగా కేకేసాడు.

కేకలు వినపడి గభీగభీమని... వచ్చింది తవుడమ్మ.

"పద పదా... రేపట్నుంచి పట్నంలో మనకుంతాది 'లగ్గం' అని చిరాకుపడి..

"ఈ కాలంలో మట్టికి... మట్టిని నమ్ముకున్నోలికి విలువెక్కడుందే..."

మన మీద శెని కూకోబట్టి గానీ... ఆ జగన్నాథం గాడు పిల్లా జెల్లాతో... పుట్టినూరిని వదిలేసి పట్నం యెలిపోనాడు. ఆ పోలయ్య... పెళ్ళాన్ని పుట్టింటికి దారెట్టేసి ఆడు దారి ఆడు సూసుకున్నాడు.
పట్నం సరుకొచ్చి మన బతుకుల్ని బుగ్గిపాలు సేస్సాయే...
మన భ్రమ గానీ... ఈ కాలంలో మట్టి ముద్దల్ని యెవడు కొంతాడే... సెప్పు!"
నిట్టూర్చాడు.
ఈరన్న ముఖం ఎర్రగా కందగడ్డలా అయిపోయింది. ఏవేవో ఆలోచనలు ముసురుకుంటున్నాయి.
ఈరన్న పెద్ద కొడుకు 'సీతారాం' పట్నంలో మెకానిక్ షెడ్‌లో పనిచేసుకుంటూ బతుకుతున్నాడు.
చిన్న కొడుకు 'సత్తిబాబు' వొడా ఫోన్ సిమ్‌కార్డ్స్ అమ్ముకుంటూ... పట్నం పట్టేసాడు.
ఇద్దరికీ పెళ్ళిళ్ళు అయ్యి... అక్కడే కాపురమెట్టారు.
మొన్న పండకొచ్చినప్పుడు పెద్ద కొడుకు .... "తనతో తీసుకెళ్ళిపోతాను" వచ్చేమన్నాడు. అప్పుడంటే ఈరన్న ఏమీ అనలేకపోయాడు. కానీ... ఇప్పుడనిపిస్తుంది.
నిర్ణయించుకున్నాడు.
నిర్ణయం... ఒకసారి అమ్మా, నాన్నలకి చెబుదామనుకున్నాడు.
ఇంటిలోకెళ్ళాడు.
గుమ్మంలో ఎదురుగా...
చెక్కుచెదరని నిబ్బరంతో... ఎలాంటి కష్టకాలాన్నైనా ఎదుర్కోవడానికి సిద్ధంగా వున్నట్లు...
ఒకదాని మీద ఒకటి పేర్చబడి 'గోపురంలా' వున్న కుండల వరుస
ఈరన్న కళ్ళు చెమ్మగిల్లాయి.
చెమ్మగిల్లిన కళ్ళల్లోంచి... "పెంకులు పెంకులుగా విరిగిపోతున్న మట్టికుండలు" కనిపించాయి.
'మట్టి కుండల మరణ దృశ్యం...."
వేయి శూలాలతో శరీరాన్ని గుచ్చినట్లనిపించింది.
అలాంటిది... కలలోనైనా వద్దనుకున్నాడు.
మరి ముందుకు అడుగెయ్యలేకపోయాడు.
ఆలోచించాడు.
'మంచం పట్టేసిన నాయనకి గెంజినీళ్ళు ఎవరు పోస్తారు?! కూకుంతే నిలబడలేని... నిలబడితే కూకోలేని ముసలి తల్లి.... అదెలా బతుకుతాది?!'
ఆలోచించాడు.
'కట్టమొత్తే... మనిసికి మనిసే పట్టించుకోని పట్నంలో ఎలా బతుకుతాము.'
ఆలోచించాడు.
ఈరన్నకు – తప్పుడు నిర్ణయం తీసుకున్నానేమోనని అనిపించింది.
గుమ్మం నుంచి బయటకొచ్చేసాడు.
ఎండిన మట్టి కుప్పల పక్కన... గుండెల్లో గూడు కట్టిన బాధని 'నిప్పుల్లా....'ఎగజిమ్మీ ఎగజిమ్మీ... అలసిపోయి గుండాగినట్లున్న 'ఆవము' కనిపించింది.
ఆవము నుంచి – గాలికి పైకి లేస్తూ... తెల్లని బూడిద గుండ. వలయాలుగా తిరుగుతూ...
భయపెడుతున్నట్లు...
'ఈరన్న'కి తలతిప్పినట్లనిపించింది.
ఆ మసక చూపులోనే...
'తరతరాల కుమ్మర్ల బతుకు పెన్నిధి' కనిపించింది.
'ఎన్నో మట్టి పాత్రలను అందంగా తీర్చిదిద్ది... ఇప్పుడు మట్టి స్పర్శ లేక.... మౌనంగా రోదిస్తున్నట్లున్న కుమ్మరి సారె'
సారెని కళ్ళనిండుగా చూసుకున్నాడు.
ఇన్నాళ్ళూ... సారెతో పాటే కష్టం ఎరగక పనిచేసిన రెండు మట్టిచేతుల్ని తడిమి తడిమి చూసుకున్నాడు.
గుండె ముక్కలయినట్లనిపించింది.
చేతులు రెండూ జోడించాడు.
'సారె'కు దణ్ణం పెడుతూ... సారె పక్కనే నిలువునా కూలబడిపోయాడు.
'ఈరన్న విషయం' తెలుసుకున్న... చుట్టుపక్కల ఇంటిగలవారందరూ.... ఈరన్న ఇంటికి చేరారు.
చుట్టూ మూగారు.
"ఓలమ్మో.... యెంత కట్టమొచ్చిందిరో ఈరన్నా!
ఒకల ఊసు తెచ్చేవోడు కాదు. ఒకల జోలు తెచ్చేవోడు కాదు. ఏ పాపం ఎరగనోలికే దేముడు శిచ్చ పెడతాడు... ఓరి నాయనో..."



ముక్కు చీదుకుంటూ... వరసకి పిన్ని అయ్యే 'సన్నాసప్ప' పెద్దగా కేకలు పెడతంది.
తల్లి సత్తెమ్మ, భార్య తవుడమ్మ... పెద్ద పెద్ద రాగాలు తీస్తూ... పెడబొబ్బలు పెడుతున్నారు.
"వారే... వొల్లకోండ్రా... ఊపిరాడుతున్నోడిని సంపేసినట్టున్నారు... కళ్ళు తిరిగి పడుంటాడు. లెండెహే..."
శ్వాస ఆడుతుందో లేదో పరీక్ష చేసి అందర్నీ సముదాయించాడు పెద్దోడు 'దాలయ్య'.
అందరూ ధైర్యం చెప్తున్నారు.
ఈరన్నల్లో మాత్రం మార్పు లేదు.
అప్పుడే...
మూగిన జనాన్ని తోసుకుంటూ లోపలకొచ్చింది నూకాలమ్మ.
చేతిలో లేత వెదురుతో... సరికొత్త అలంకరణతో శోభిస్తున్న గంప!
నూకాలమ్మ అలికిరికి... ఈరన్న కళ్ళు కదిపాడు.
జీవిత చైతన్య దీప్తిని కళ్ళారా చూసుకోబోతున్నట్లు ... పూర్తిగా కళ్ళు తెరిచాడు.
నూకాలమ్మ చేతిలో 'గంపని... రేపటి మానిగంపని' చూస్తూ... ప్రాణం లేచొచ్చినట్టు... గుండెల్నిండా గాలిని పీల్చుకుని... లేచి నిలబడి... 'సారె' తిప్పిన కర్రనందుకుని...
'సారె' ఉన్న వైపు కదిలాడు.
మట్టి కుప్పల్నుంచి 'మట్టి వాసన' తెరలు తెరలుగా ఇల్లంతా... వాసంతా... అలుముకుంది.

# తెలుగు సాహిత్యంపై రవీంద్రనాథ్ టాగూర్ ప్రభావం



డా. తన్నీరు కళ్యాణ్‌కుమార్
✆ : 9490776385

'గీతాంజలి' వెలువడిన తరువాత అన్ని దేశాలవారు, అన్ని భాషల వారు రవీంద్రుని రచనలు చదవడం ప్రారంభించారు. రవీంద్రుని రచనలు అనేక ప్రాంతీయ, విదేశీ భాషలలోకి అనువాదం అయ్యాయి. దేశంలోని అన్ని ప్రాంతాల భాషా రచయితలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో రవీంద్రుని రచనలను అనుసరించడం మొదలుపెట్టారు.

ఆధునిక సాహిత్యం ఆరంభం నుండి బెంగాలీ సాహిత్యం తెలుగు సాహిత్యంపై చూపిన ప్రభావం అపారం. బంకించంద్ర , రవీంద్రనాథ్ టాగూర్, బిభూతి భూషణ్, బందోపాధ్యాయ, మైకేల్ మధుసూదనదత్తు వంటి బెంగాలీ రచయితలెందర్నో తెలుగువారు తమవారే అన్నంతగా అక్కున చేర్చుకున్నారు. ఈ రచయితలు తమ మాతృభాష బెంగాలీలో రాసి ఇంట గెలవడమే కాకుండా, తమ రచనలు ఎన్నో భాషల్లో అనువాదమై రచ్చ కూడా గెలిచారు.

భారతీయ సాహిత్యాన్ని తమ రచనలతో సుసంపన్నం చేసిన ఆధునిక కవులలో గురుదేవ్ రవీంద్రనాథ్ టాగూర్ ప్రముఖులు. రచయితగా, తత్త్వవేత్తగా, చిత్రకారునిగా, విద్యావేత్తగా, సంగీతవేత్తగా మానవతామూర్తిగా టాగూర్ చరిత్రలో నిలిచిపోయారు. కవిత్వం, వచనం, గేయం, నవల, నాటకం, కథ మొదలగు సమస్త సాహితీ ప్రక్రియలు రవీంద్రుని చేతిలో కొత్త జీవాన్ని పొందాయి. రవీంద్రుని 'గీతాంజలి' నోబెల్ బహుమతిని (1913) సాధించి భారతీయ సాహిత్యానికి అంతర్జాతీయ ఖ్యాతిని సముపార్జించి పెట్టింది. నోబెల్ బహుమతి అందుకున్న మొట్టమొదటి ఆసియా వాసి కూడా ఈయనే కావడం విశేషం. రవీంద్రుడు తన జీవిత కాలంలో రచించిన మొత్తం పుస్తకాల సంఖ్య 237.

'సంధ్యాసంగీత్' (1882) 'ప్రభాత్ సంగీత్' (1882), 'మానసీ' (1890), 'వసుంధర చిత్రా' (1896), 'ఊర్వశి', 'కల్పనా', స్మరణ్ (1906), చైతాలీ, ఛబీ ఓగాన్ మొదలైన కవితలు రవీంద్రునిలోని భావుకతకు, సౌందర్యోపాసనకు, మార్మికతకు, వాత్సల్య పూరిత హృదయానికి నిదర్శనాలు. సామాన్య మానవుని సంఘర్షణ నుండి ఆత్మ పరిశీలన, ఆత్మ నివేదనల వరకు రవీంద్రుని కవితలో దర్శనమిస్తాయి. ఈయన కవిత్వంలో భావ, నాద సమ్మేళనం అపూర్వమైన అంశం. ప్రాచ్య, పాశ్చాత్య ఉత్తమ భావ సమ్మేళనంతో విశ్వ మానవ సమ్మేళనంతో విశ్వ మానవ సౌభ్రాత్ర భావాన్ని నొక్కి వక్కాణించిన ఆధునిక కవులలో రవీంద్రుడు అగ్రగణ్యునిగా వినుతింపబడినారు.

రవీంద్రుని సాహిత్యంలో ఆయన గీతికా సాహిత్యం శిరోమణి వంటిది. ఇందులో ఈయన హృదయం ప్రతి పదంలోనూ స్పందిస్తుంది. ఈయన ప్రాణం ప్రతి శబ్దంలోనూ ప్రజ్వలిస్తుంది. ఇలాంటి గీతికా సంపుటాలే ఆయన వంగ 'గీతాంజలి', 'నైవేద్యం', 'ఖేయా' అనేవి. ఈ మూడింటిలోనివి కొన్ని, మరో ఒకటి రెండు గీతాలను టాగూరే ఆంగ్లలోకి అనువదించి 'గీతాంజలి' అని పేరు పెట్టారు. ఇదే ఆయనకు అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చిన ఆంగ్ల 'గీతాంజలి'. ప్రపంచ సాహిత్యంలోనే ఇది గొప్ప రచన.

'గీతాంజలి' కి నోబెల్ బహుమానం వచ్చినందువల్ల గొప్పది కాలేదు. అది గొప్పదైనందునే నోబెల్ బహుమానం వచ్చింది. ఈ కావ్యంలో సాహిత్య సౌరభానికి తోడు అంతర్‌దృష్టీ, జీవన సాధన అంతర్ నిహితమై వున్నందునే అది గొప్పదైంది. యుగ యుగాల విశ్వ మానవుని మధుర సాధన ఇందులో భాషా రూపాన్ని దాల్చింది. మానవుని కృంగదీసే నిరాశా నిస్పృహలను, సకల సృష్టిని ప్రేమ భావంతో చూసి, శ్రమ యొక్క గొప్పతనాన్ని సూచించే మహత్తర సందేశం 'గీతాంజలి'లో ముఖ్యాంశం, ఈ కావ్యంతోనే టాగూర్ 'విశ్వకవి'గా ఖ్యాతికెక్కారు.

'గీతాంజలి' వెలువడిన తరువాత అన్ని దేశాలవారు, అన్ని భాషల వారు రవీంద్రుని రచనలు చదవడం ప్రారంభించారు. రవీంద్రుని రచనలు అనేక ప్రాంతీయ, విదేశీ భాషలలోకి అనువాదం అయ్యాయి. దేశంలోని అన్ని ప్రాంతాల భాషా రచయితలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో రవీంద్రుని రచనలను అనుసరించడం మొదలుపెట్టారు. గీతాంజలి (1910) రచన కాలానికి, రవీంద్రుడు నోబెల్ బహుమతి (1913) సాధించిన సమయానికి తెలుగులో భావ కవిత్వం

రాజ్యమేలుతుంది.

ఆంగ్ల సాహిత్యంలోని 'రొమాంటిసిజం' నాటి తొలితరం భారతీయ విద్యావేత్తలను బాగా ఆకర్షించింది. ఈ రొమాంటిసిజాన్ని తెలుగులో కాల్పనికవాదమని అనువదించుకున్నాం. కానీ కవిత్వానికి మాత్రం భావ కవిత్వమనే పేరు స్థిరపడింది. భారతీయ భాషలలో మొదటగా బెంగాలీ సాహిత్యంలో కాల్పనికోద్యమం ప్రారంభమయింది. బెంగాలీ కవుల రచనల ప్రభావంతో ఇతర భారతీయ భాషా సాహిత్యాల్లో కాల్పనికోద్యమం ప్రారంభమయింది. బెంగాల్‌లో వచ్చిన భావ చైతన్యం తెలుగు రచయితలను బాగా ప్రభావితం చేసింది. సామాజికంగానే గాక సాహిత్యంలోనూ బెంగాలీ సాహిత్య ప్రభావం తెలుగు వారిని బాగా ప్రభావితం చేసింది. రవీంద్రుని యొక్క రచనల ప్రభావం తెలుగులో భావ కవిత్వంపై అధికంగా ప్రసరించింది.

భావకవులు భక్తి భావాలతో కూడిన కవితలు రాసారు. పాశ్చాత్య కాల్పనిక కవుల్లోనూ భక్తి మార్మికత చోటు చేసుకున్నాయి. ఆంగ్లంలో కూపర్, బ్లేకు కవితల్లో ఈ భక్తి మార్మికత దర్శనమిస్తుంది. భారత వైష్ణవ భక్తి గీతాల్లో భగవంతుడు ఆలంబనగా ప్రణయం, విరహంతో కూడిన గీతాలున్నాయి. ఈ గీతాలలో భక్తులు ఆత్మ, పరమాత్మల మధ్య కలయికను కోరుతూ ఆరాటం వ్యక్తం చేస్తారు. వైష్ణవ భక్తిగీతాల్లోని, సూఫీ భక్తుల కవిత్వంలోని మార్మికత రవీంద్రునిలో సాక్షాత్కరిస్తుంది. ఈ మార్మికత్వ ప్రభావంతోనే టాగూర్ 'గీతాంజలి' వంటి కవితలను సృజియించారు.

తెలుగు భావకవులు కూడా మార్మికత చేత ప్రభావితులైనారు. వెంకట పార్వతీశ్వర కవుల 'ఏకాంత సేవ'లో మధుర భక్తి ఉంది. ఈ కావ్యం రవీంద్రుని 'గీతాంజలి' వంటిదని కృష్ణశాస్త్రి అభిప్రాయం. వంగభాషకు రవీంద్రుని 'గీతాంజలి' ఎట్టిదో, తెలుగు భాషకు 'ఏకాంతసేవ' అట్టిదని విమర్శకుల అభిప్రాయం. కృష్ణశాస్త్రి 'మహతి' కావ్యంలో భగవద్భక్తి ప్రధాన వస్తువు. ఆయన రచించిన "కృష్ణపక్షము"లోని 'పాప నా కాన్క', 'అన్వేషణము' గేయాల్లో భక్తి భావాలు, ఆత్మ పరమాత్మల అన్వేషణ వున్నాయి. వైష్ణవంలోని మధుర భక్తి ప్రభావంతో భావకవులు ప్రేయసికి – తమకు ఒక దివ్య సంబంధాన్ని సృష్టించుకొని, సంయోగం కోసం ఆరాటపడ్తూ విరహ కవిత్వాన్ని రచించారు. బసవరాజు అప్పారావు 'గోపికా గీతములు' లో భక్తి మార్మికతలు వున్నాయి. కరుణ శ్రీ 'ఉదయశ్రీ'లో చిత్రించిన 'రాధిక వేదన' కూడా ఇటువంటిదే.

భావకవులు తమకు ఆప్తులైన వాళ్ళ మరణానికి తపిస్తూ, దుఃఖిస్తూ తమ ఆత్మవేదనను కవితలుగా రచించారు. ఈ కవితలను ఆంగ్లంలో ఎలిజీ అంటారు. తెలుగులో ఈ కవితలకు స్మృతిగీతం, స్మృతి కావ్యం, శోక గీతం, శోక కావ్యమని పలు పేర్లు ఉన్నాయి. ఆంగ్ల సాహిత్యంలో బ్రౌనింగులా సేజియన్, టెన్నిసన్ 'ఇన్ మెమోరియం', ఆర్నాల్డ్ హెయన్స్ గ్రేవ్ ప్రసిద్ధమైన స్మృతి కవితలు. రవీంద్రుడు కూడా బెంగాలీ భాషలో తన సతీ నిర్యాణానికి దుఃఖిస్తూ 'స్మరణ్" (1902) అనే స్మృతి కవితను రాసారు. ఈ కవిత రవీంద్రుని హృదయ వేదనకు, ఆర్ద్రతకు ప్రతిరూపం.

విశ్వనాథ వారి 'వరలక్ష్మీ త్రిశతి', బాలాంత్రపు వెంకటరావు 'విరహ గీతము' సతీ స్మృతి కావ్యాలు. బసవరాజు గారు తన కూతురి స్మృతితో 'నిర్యాణ సుఖము' వ్రాయగా, నాయని వారు తన కుమారుని స్మృతిలో 'విషాద మోహనము' అనే కావ్యాన్ని వ్రాసారు. నాయని వారి 'మాతృగీతాలు' తల్లి స్మృతితో వ్రాసిన గీతాలు, దువ్వూరి 'సోదరీ స్మృతి', అబ్బూరి 'సోదర స్మృతి' మొదలయినవి ప్రసిద్ధ స్మృతి కావ్యాలు.

ప్రాచీన కవులు స్త్రీల కచకుచ వర్ణనలు – సంభోగ శృంగారాలను వర్ణిస్తే, భావకవులు స్త్రీని ప్రేయసిగా ఆరాధన విశేషంగా చేసి పూజించారు. ప్రేయసిని దేవతగా, తాను భక్తునిగా చేసి కామవాసన లేని ప్రేమ కవిత్వాన్ని వీరు సృజియించారు. ప్రేయసికి – కవికి మధ్య ఆరాధన తత్త్వమే చోటు చేసుకుంటుంది. అందులో భాగవత తత్త్వమే గాని, లౌకికం ఏమీ లేదు. రవీంద్రుని కొన్ని కావ్యాలలో ఇటువంటి తత్త్వమే గోచరిస్తుంది. రవీంద్రుని కావ్య ఖండాలలో 'ఊర్వశి' పూర్తిగా సౌందర్యాన్ని ఒలకబోసిన అద్భుత రచన. ఈ 'ఊర్వశి' ని టాగూర్ సౌందర్యానికి ప్రతిరూపంగా అభివర్ణించారు. టాగూర్ తాను వర్ణించిన ఊర్వశిని తానే వరించారు. ఆ అప్సర స్త్రీ సౌందర్యంలో తమని తామే మరిచిపోయారు.

రవీంద్రుని కవిత్వంతో పాటు, బ్రహ్మ సమాజంలోని ప్రేమతత్త్వ ప్రభావం కూడా తెలుగు కవులపై పడింది. తెలుగులో కృష్ణశాస్త్రి, నాయని, అబ్బూరి, వేదుల, అడవి బాపిరాజు, శివశంకర శాస్త్రి ప్రణయ కవిత్వం రాసారు. కృష్ణశాస్త్రి గారి ఊహా ప్రేయసి కూడా 'ఊర్వశే'. రవీంద్రుని 'ఊర్వశి' కి. కృష్ణశాస్త్రి 'ఊర్వశి'కి చాలా సారూప్యతలున్నాయి. కృష్ణశాస్త్రి కూడా విశ్వ సౌందర్యానికి ప్రతీకగా 'ఊర్వశి'ని సృష్టించారు. అట్లే నాయని 'వత్సల', అడవి బాపిరాజు – 'శశికళ' మొదలగు కావ్యాలు. రవీంద్రుని రచనా ప్రభావానికి లోనైన కావ్యాలని చెప్పవచ్చు.

'విశ్వకవి'గా మన్ననలందుకున్న టాగూర్ నవలా కర్తగా కూడా సుప్రసిద్ధులు. 'చోకర్‌బాలి', 'నౌకాదుబీ' (1906), 'గోరా' (1910), 'ఘర్ బైరే', 'బౌరాకూర్' మొదలగునవి ఆయనచే వ్రాయబడిన ప్రసిద్ధ నవలలు. 'చోకర్ బాలి' మానసిక సంఘర్షణలను చిత్రించిన అపూర్వ రచన కాగా, 'నౌకాదుబీ' ఘటన ప్రధానంగా నిర్మించబడ్డ నవల. ఇది దేశంలోని కాల్పనిక వాదులనూ, భావవాదులనూ బాగా ఆకర్షించింది. బుచ్చిబాబు వంటి రచయితలకు ప్రేరణనిచ్చిన నవలలివి. వంగదేశంలో వెల్లివెరిసిన సాంస్కృతిక, ధార్మిక, సామాజిక చైతన్యాన్ని ప్రతిబింబింపజేసిన నవల 'గోరా'. ఈ నవలలోని వ్యభిచరింపని ప్రేమ ధర్మం విశ్వనాథ సత్యనారాయణ వంటి సంప్రదాయవాదిని ఆకర్షించింది.

కథానిక ప్రక్రియను సమర్థవంతంగా నిర్వహించిన మొదటి వంగీయుడే కాదు. మొట్టమొదటి భారతీయుడు కూడా టాగూరేనని కొందరు సాహితీ విమర్శకుల అభిప్రాయం. ఈయన కథలలో ఇతివృత్తం, రూపం, ఆకృతి వంటి అంశాలతో వైవిధ్యం ఉంటుంది. ప్రతి కథా అప్రయత్న శిల్పంతో, సొగసుగా పరిపూర్ణతతో విరాజిల్లుతూ ఉంటుంది. 'కాబూలీ వాలా', 'రామ్‌చరణ్', 'పోస్ట్‌మాస్టర్', వంటి వైవిధ్యం గల పాత్రలను టాగూర్ తన కథల్లో ప్రాణం పోశారు. ఈయన కథలు అనేక భాషలలోకి అనువదించబడ్డాయి. రవీంద్రుని పాత్ర చిత్రణ, ఇతివృత్త వైవిధ్యం, కథా సంవిధానం అనేకమంది ఇతర భాషా కథకులకు

## ఆకు రాలిన మహావృక్షం

వలన్‌దాన్ వెంకటేష్
✆ 9505555197

ఊరంటే...
ఇప్పుడు
గొంతెండిన సెలయేటి
మట్టి పొలుసులు
వికృత రూపం
రాలిపడిన వరి కంకుల
దగ్ధస్వరం...
దూదిపూల దుఃఖానికి
కేరాఫ్ అడ్రస్
కృత్రిమంగా మనిషి దిద్దిన
సహారా ఎడారి

ఊరంటే...
ఇప్పుడు
కులవృత్తుల కుత్తుకపై
వేటగాడి దాడి దృశ్యం
సున్నపురాళ్ళ ముళ్ళకంచెలో
బంధీ అయిన భూమి
రియల్, రియాలిటీ...!

ఊరంటే...
ఇప్పుడు
మోడు బారిన మొండి గోడలు
అస్థి పంజరాల ఆవాసం
పొక్కిలి బ్రతుకుల
స్మశాన ఘీంకారం
నీటి గోసకు నిలువెత్తు సాక్షి
వరల్డ్ హంటర్ భారిన పడ్డ
క్రిష్ణ జింక...!

ఊరంటే....
ఇప్పుడు
రుద్ర పురుగుల ఆనవాళ్ళు లేని
ఆవాసం...
విసిరేసిన ఎంగిలి విస్తరి
అమావాస్య చీకటి అంధకారం
అంపశయ్యపై పడుకున్న
ఆర్తనాథం

ఆరు దశాబ్దాల
మేడిపండు

ఊరంటే ....
ఇప్పుడు
యుద్ధమేఘాలు అలుముకున్న
పరాయికరణ
మనిషిని మనిషి
నమ్మలేని
యాంత్రీకరణ
ఉచ్ఛ్వాసనిచ్ఛ్వాసలకు సైతం
సంకెళ్ళు

ఊరంటే...
ఇప్పుడు
గొంతెండిన సెలయేటి
మటిపొలుసుల
వికృతరూపం...!

---

మార్గదర్శకమయింది. తెలుగు కథా సాహిత్యం సైతం పరోక్షంగా ఈ ప్రభావానికి లోనైనదని చెప్పవచ్చు.

రవీంద్రుడు వంగ ఛందస్సులో ఎన్నో నవ్య రీతుల్ని, ఎన్నో నూతన గతుల్ని సృష్టించారు. వంగ సాహిత్యంలో వ్యావహారిక భాషకు పట్టం గట్టిన మహానుభావుడు రవీంద్రుడు. టాగూర్ తన సాహిత్య ప్రారంభదశలో అవ్యావహారిక శైలిని స్వీకరించినప్పటికీ, క్రమంగా తరువాత కాలంలో తమ రచనలన్నీ వ్యావహారిక శైలిలోనే సృజియించారు. అవ్యావహారికంలోని సజీవత్వం, గతిశీలతా గ్రాంథికంలో గోచరించకపోవడంతో ఇతర వంగ రచయితలు కూడా దీన్ని అనుసరించారు. వంగ రచయితలు మాత్రమే కాదు, వంగ దేశంతో సాహితీ సంపర్కం గల ఇతర ప్రాంతీయ రచయితలు కూడా ఈ వ్యావహారిక శైలిని తమ తమ భాషల్లో ప్రవేశపెట్టారు. ఈ విషయంలో తెలుగువారు కూడా ముందడుగు వేసిన సంగతి సర్వవిదితమే.

టాగూర్ సాహిత్య విమర్శ వ్యాసాలు 'సాహిత్య' - 'సాహిత్యేర్ పథ్' - 'సాహిత్యేర్ స్వరూప్' అనే మూడు సంపుటాలు బెంగాలీలోను, 'పర్సనాలిటీ' (Personality) - 'ది రెలిజియన్ ఆఫ్ ఏన్ ఆర్టిస్ట్' (The religion of an Artist) అనే ఆంగ్ల వ్యాస సంపుటాలు ప్రకటితమయ్యాయి. రవీంద్రుడు తన విమర్శనా రచనలో ఏ ఇతర సాహిత్య విమర్శకులను అనుసరించలేదు. ప్రాచ్య, పాశ్చాత్య వైఖరులను మేళవించిన నూతన విమర్శనా విధానానికి శ్రీకారం చుట్టిన విమర్శకుడు కూడా టాగూరే కావడం విశేషం.

టాగూర్ సృజనాత్మక రచనలు సాహిత్య విమర్శకులకెందరికో వస్తువులైనాయి. తెలుగులో ప్రాచ్య, పాశ్చాత్య రీతుల్ని మేళవించి సంయమనంతో విమర్శ చేసిన వారిలో ఆర్.ఎస్.సుదర్శనం ముఖ్యులు. ఈయన రచించిన 'సాహిత్యంలో దృక్పథాలు', 'సమాజం - సాహిత్యం', 'సాహిత్య నేపథ్యం' మొదలగు ప్రామాణిక విమర్శనా గ్రంథాలపై కూడా రవీంద్రుని ప్రభావం ఉందని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

ఆంధ్రదేశపు రవీంద్రునిగా కీర్తింపబడే సూర్యదేవర సంజీవ్‌దేవ్ పై టాగూర్ యొక్క ప్రభావం అపారమైనది. సంజీవ్‌దేవ్ కూడా రవీంద్రుని వలె కవి, తత్త్వవేత్త, చదువరి, చిత్రకారుడు కావడం విశేషం. రవీంద్రుని తత్త్వ భూమిక, సౌందర్యోపాసన, కళాతత్త్వ, దృష్టి, విశ్వ మానవ దృక్పథం సంజీవ్‌దేవ్‌ను ఎంతగానో ప్రభావితం చేసాయి. సంజీవ్‌దేవ్ చిత్రలేఖనంలోనూ, రచనలలోనూ రవీంద్రుని దృక్పథం స్పష్టంగా సాక్షాత్కరిస్తుంది.

రవీంద్రుడు గొప్ప మాతృభాషాభిమాని. ఈయన వంగ సాహిత్యంలోను, దాంతో పాటు భారతీయ సాహిత్యంలోను ఒక విస్తృతమైన విశ్వజనీన దృక్పథాన్ని ప్రవేశపెట్టారు. ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ రవీంద్రుని సాహితీ ప్రభావానికి లోను కాని భారతీయ భాషా సాహిత్యాలు లేవని అనుట అతిశయోక్తి కాదు. మాతృభూమి - మానవ సంబంధాల పట్ల అచంచలమైన నమ్మకం, ప్రేమాభిమానాలు కలిగిన విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ స్థానం భారతీయ సాహితీ చరిత్రలో సుస్థిరం.

# పాత ఉత్తరాలు

- డా॥ ఎన్. గోపి

పెట్టె అడుగున దొరికిన
పాత ఉత్తరాలు
పొడి పొడిగా రాలుతున్న
అలనాటి క్షణాలు !

ఒక్కొక్క మడతే విప్పుతుంటే
ఏదో ఆత్మీయ మార్దవం !
కొన్ని బరువుగా ఉన్నాయి
పుటల సంఖ్య కాదు
విషాద ఘటనలు

పెట్టె అడుగున ఉత్తరాలు
గుండె అడుగున దాగిన
జ్ఞాపాలను వెలికి తీస్తున్నాయి.

కాలాన్ని వెనకకు లాక్కొచ్చే
అక్షర మంత్రాలు కొన్ని
సుదూర ప్రదేశాలను
ఎదుట నిలిపే
ఇంద్రజాల సూత్రాలు మరికొన్ని

ఈ కాగితాలు
పరవళ్ళు తొక్కే భావనదులు
త్రికాలాలను
కలిపే వారధులు

కొత్త కరెన్సీలాగా
కడక్‌గా లేవు
కన్నీటి ఉప్పు మరకల్తో
అనుభవాల సడక్‌లా ఉన్నాయి

ఆపద సమయాల్లో
మా ఆవిడ
కుండల్లోంచి పైసలు తీసినట్టు
మనసులో
చీకటి ముసిరినప్పుడు
నేను పాత ఉత్తరాలు పఠిస్తాను



# మారిపోయిన పల్లె

- బి. విజయేశ్వర రావు
✆ : 9177065136

ఎవ్వరు కనబడినా చాలు
ఆకుపచ్చగా నవ్వుతూ
పలుకరించేది నాపల్లె !
తూరుపు తలుపు తెరుచుకొని
వెలుగును మోసుకొంటూ బయలుదేరిన
సూరీడి తొలివెచ్చని స్పర్శతో
వికసించిన కోనేటి కమలాలు
పుష్పగుచ్ఛాలై స్వాగతించేవి !
ఊరి మొదలు చెరువు గట్టు మీద
చాకలి ఆరేసిన చీరలు
అతిథుల కోసం పరిచిన
తివాచీల్లా దర్శన మిచ్చేవి !
రోడ్డు కిరువైపులా ఎదిగిన చెట్లు
పరిమళాన్ని వెదజల్లుతూ
పూలతో ఆశీర్వదించేవి !
అపరిచితులనైనా ఆత్మీయంగా ఆహ్వానించే
నిష్కల్మష హృదయాలు
అడుగడుగున కనిపించేవి !
గుప్పెడు మట్టిని గుండెలపై అద్దుకుంటే



అమ్మను హత్తుకున్నంత హాయిగా ఉండేది !
గుక్కెడు నీళ్లను గొంతులో పోసుకుంటే
అమృతాన్ని ఆస్వాదించినట్టుండేది !
ఊరంతా ఉమ్మడి కుటుంబాలతో
అనురాగం విరబూసే
ఆనందవనంలా ఉండేది !
ఇప్పుడు నాపల్లె మారిపోయింది !
రాజకీయ మేఘాలు కురిపించిన
రసాయన ఫ్యాక్టరీల వర్షంలో తడిసి
నాపల్లె కాలుష్యమైపోయింది !
వేతనం లేక యాతన పడుతున్న శ్రమజీవులు
తిండి గింజల కోసం వలస పక్షుల్లా ఎగిరిపోతుంటే
నాపల్లె ఎడారయింది !
ఇప్పుడు మేం జానపదులం కాదు
జానెడు పొట్టకోసం జారిపోతున్న వాళ్ళం !
రెక్కలొచ్చి భూములొక్కక్కటి ఎగిరిపోతుంటే
మట్టివాసన కరువై మట్టికొట్టుకుపోతున్నాం !
నగర సర్పం చిమ్మిన విష సంస్కృతి
నరనరాల్లో జీర్ణించుకుపోయి
జీవచ్ఛవంలా బతుకుతుంది నాపల్లె !
ప్రపంచ పటానికి
నా పల్లె ఒక విషాద ముఖచిత్రమైంది !

# మధ్యతరగతి జీవితం కథలకు మాగాణం



మధ్య తరగతి జీవితం విస్తారంగా, విభిన్నంగా ఉండడం వల్ల అక్కడ జీవనసారం ఉన్న కథాంశాలు పుష్కలంగా దొరకుతాయని ప్రముఖ రచయిత పెద్దిభొట్ల సుబ్బరామయ్య అన్నారు. పెద్దిబొట్ల సుబ్బరామయ్యకు కథా విభాగంలో **2012** సంవత్సరానికి గాను కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు లభించింది. ఈ సందర్భంగా ఆయనతో ఇంటర్వ్యూ విశేషాలు...

**రచయిత కావడం ఎలా సంభవించింది?**

ఎక్కువ అభ్యాసం చేత వచ్చేది కవిత్వం. మధనపడడం వల్ల వచ్చేది కథ. చిన్నతనంలో మా ఒంగోలు ప్రాంతంలో కాలేజీలు లేవు. మున్సిపల్ హైస్కూల్లో చదివాను. మా తెలుగు మాష్టారు సాహిత్యం గురించి చెబుతుండేవారు. ఆయన సంస్కరణవాది. వితంతు వివాహం చేసుకున్నారు. ఆయన ప్రేరణతో 'భారతి, కోమలి' వంటి పత్రికలు చదివేవాళ్ళం. ఇంటర్మీడియట్‌కు వచ్చేసరికి కెవి రమణారెడ్డిగారు మాకు చరిత్ర బోధించేవారు. ధారా రామనాథశాస్త్రి గారు కూడా ఒక లెక్చరర్. చిన్నప్పుడే కాలేజీ మ్యాగజైన్‌లో కథ రాశాను. అయితే దాన్ని మొదటి కథగా పరిగణించననుకోండి. ఇంటర్మీడియట్లో స్పెషల్ తెలుగు తీసుకున్నా బిఎలో కూడా ఎస్ఆర్ఆర్ కాలేజీలో విశ్వనాథ సత్యనారాయణ, మెట్లపల్లి సీతాపతిరావు, జటావలోక పురుషోత్తమరావు, జొన్నలగడ్డ సత్యనారాయణ వంటివారు మా లెక్చరర్లు. స్పెషల్ తెలుగులో నలుగురమే. విశ్వనాథ కొన్నిసార్లు క్లాసుకు వచ్చేవారు కాదు. వెళ్లి అడిగితే ఇంటికి రమ్మనేవారు. వెళ్తే చాలాసేపు చెప్పేవారు.

బిఏ పూర్తిచేశాక- లయోలా కాలేజీలో ట్యూటర్‌గా ఉద్యోగం వస్తుందని వెళ్లమన్నారు. బస్సెక్కి వెళ్తుంటే విజయవాడ జవహర్ టాకీస్ (ఇప్పటి విజయ)లో సత్యజిత్‌రే 'పథేర్ పాంచాలి' నడుస్తోంది. అక్కడే దిగిపోయాను. ఎందుకంటే ఆ సినిమా గొప్పతనం గురించి, న్యూయార్క్‌లో ఒకే థియేటర్‌లో ఆరు నెలలకు పైగా నడవడం గురించి 'టైమ్' మ్యాగజైన్‌లో చదివి ఉన్నాను. కాలేజీకి వెళ్లడం కుదరలేదని ఇంట్లో చెప్పాను. తరువాత మళ్లీ వెళ్లి ట్యూటర్‌గా చేరాను. తర్వాత ఎంఏ కూడా పూర్తిచేశాను. 1959లో సరదాగా 'చక్రనేమి' అనే కథ రాశాను. అది అనుకోకుండా భారతిలో అచ్చయింది. థ్రిల్ అయ్యాను. భారతిలో 4, 5 కథలు, రెండు నవలలు రాశాను. తర్వాత విశాలాంధ్ర వారు అనేక సంపుటాలు ప్రచురించారు.

**సాధారణంగా మీరు రచయితలు కాగోరే వారికి స్వయంగా చూసింది రాయమని చెబుతుంటారు, అయితే మీపై చదివిన పుస్తకాల ప్రభావం కూడా చాలా ఉన్నట్లు కన్పిస్తుంది.**

నేను చాలా ఎక్కువగా చదివేవాణ్ణి... తిరుగుతూ చూస్తుండేవాణ్ణి. అయితే ఎలాగైనా రచయిత కావాలని అనుకోలేదు. మనం మటుకు ఎందుకు రాయకూడదని అనిపించి ఉండొచ్చు. సామాజిక వాస్తవికతను సాహిత్యంలోకి తేవాలనిపించింది. 'దో బీఘే జమీన్' వంటి సినిమాల ప్రభావం కూడా ఉంది. వాస్తవికతను చిత్రించడానికి శ్రీశ్రీ పద్ధతి కూడా చాలదనిపించింది. దానిలో భాష పెంచి, ఫ్లెంబాయింట్‌గా పొంగించి రాయడం జరిగేది. అందుకే నాకు కథ బెస్ట్ అనిపించింది. నవల అల్లుకుపోవచ్చు. కథ కష్టం. నాటికైతే నాలుగు నోళ్లు మాట్లాడతాయి. నవలలో నాలుగు చాప్టర్లు అదనంగా చేర్చవచ్చు. కానీ, కథ చాలా సున్నితమైనది. ఏదైనా మనసులో పడిన తర్వాత మథనం జరుగుతుంది. ఉదాహరణకు రైలు పెట్టెలు ఊడ్చుతూ బతుకు ఈడ్చే పిల్లల గురించి నాలుగు కథలు రాశాను. ఒకసారి పోలీసులు వారిని కొట్టారు. ఎటువారటు పారిపోయారు. ముగ్గురు ఒకవైపు పోతే ఒక్కడు మాత్రం ఇంకో వైపు పోయాడు. కాని ఎక్కడికి పోతాడు? కొన్ని అనుభవాలతో ఎలాగో మళ్లీ స్టేషన్‌కే వచ్చాడు. ఆ కుర్రవాడి సమస్యకు నేనేం పరిష్కారం చూపగలను? వరవరరావు 'కుక్కపిల్ల' కవిత నన్ను బాగా ఆకర్షించింది. ఆ ఇతివృత్తం కూడా ఇలాటిదే. 'లేచిన వేళ' 'నిప్పుకోడి' 'వగైరా' కథలు ఆ కోవకు చెందినవే.

విజయవాడ రామా టాకీస్ పరిసరాల్లో 60వ దశకంలో మురికివాడలుండేవి. కార్లషెడ్డు కూడా అక్కడ చవకబారు వ్యభిచారం పెద్దఎత్తున సాగుతుండేది. తర్వాత అక్కడ పెద్ద పెద్ద సినిమా కాంప్లెక్సులు వచ్చాయి. సినిమా పోస్టర్లు రాష్ట్రమంతటికీ అక్కడి నుంచే పంపిణీ అవుతాయి. వ్యభిచారులను నిర్మూలించిన చోటు నుంచి సాగే ఈ సినిమా విషం అంతకంటే జుగుప్సాకరమైంది. అపాయకరమైంది కూడా. అంతేగాక ఈ వ్యభిచార గృహాల నిర్వాహకులు చుట్టుపక్కల నిర్మించిన భారీ అపార్ట్‌మెంట్లలో ఫ్లాట్లు తీసుకుని అక్కడినుంచి నడపటం మొదలు పెట్టారు. ఈ పరిణామాన్ని 'పంజరం', 'ముక్తి' వంటి నవలల్లో చిత్రించాను.

**మీ పాత్రలు ఎక్కువగా చనిపోతాయనే అభిప్రాయం ఉంది కదా. ప్రధానంగా మీరు కరుణ రసానికే పెద్దపీట వేశారు.**

(నవ్వుతూ) 'సుబ్బరామయ్య కథల్లో పాత్రలు చచ్చిపోతాయి. లేక హాయిగా నిద్రపోతాయి' అని కవ్వగంతుల మల్లికార్జునరావు అన్నారు. ప్రయత్నించినా హాస్యాన్ని రాయలేకపోయాను. ప్రసిద్ధ నటుడు కె. వెంకటేశ్వరరావు గొడవపెడితే ఒక నాటకం రాశాను. కాని కంటిన్యూ చేయలేదు. నా కథల్లో కూడా మాటల పొదుపు పాటిస్తాను. ఆర్ద్రత నింపడం, కరుణ రసాన్ని పండించడం చాలా కష్టం. కరుణ రస సూత్రం చాలా సున్నితమైంది. ఎక్కువగా లాగినా పెద్ద నష్టం లేదు. హాస్య రసం అలా కాదు. ప్రతి మనిషికీ ఒక జీవలక్షణం ఉంటుంది. అలాగే ప్రతి సిన్సియర్ రచయితకు ఒక లక్షణం ఉంటుంది.

**డిసెంబర్ 15న 1938 న జన్మించిన పెద్దిభొట్ల సుబ్బరామయ్య 1957 నుంచి 1996 వరకూ విజయవాడ ఆంధ్రలయోలా కళాశాలలో తెలుగు శాఖాధిపతిగా పనిచేశారు. 1959లో రచనలు చేయడం ప్రారంభించారు. ధృవతార, వేదుమాత్ర, అంగారతల్పం, పంజరం, కాలుతున్న పూలతోట, త్రిశంకుస్వర్గం, వర్ణమాల- అనే నవలలు, నయనతార, ముసురు, పొగమంచు, కళ్లజోడు, పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథలు, చిలక హంస, గాంధీని చూసినవాడు- అనే కథా సంకలనాలు వెలువరించారు. ఇప్పటి వరకు 200కు పైగా కథలు, 12 నవలలు రాసిన పెద్దిభొట్ల తెలుగు సాహిత్యానికి చిరపరిచితులు. ఇంగ్లీషులోకి ఒక సంపుటి అనువాదమైంది. కొన్ని కథలు వివిధ భారతీయ భాషల్లోకి, రష్యన్‌లోకి అనువాదమయ్యాయి.**

అంతేగాని నిర్వచనాలిచ్చి కంపార్ట్‌మెంటలైజ్ చేయనక్కరలేదు. చదివిని వారిలో 'ఫీలింగ్' కలిగించాలి. అంతకు మించి వేరే కొలమానం లేదు.

**ఈనాడు వచ్చే కథల గురించి మీ అభిప్రాయం?**

కాలువ మల్లయ్య, అల్లం రాజయ్య వంటి వారు అట్టడుగు పొరల్లోని జీవితం, వాస్తవికతను చిత్రీకరించడం గొప్ప విషయం. నేను నాకు తెలిసిన జీవితం గురించి రాశాను. వాళ్లు వాస్తవంగా పల్లెసీమల్లోని మట్టి మనుషుల గురించి, వాళ్ళ బాధల గురించి రాశారు. అయితే అలాంటివి ఎప్పుడూ రాయలేమని, ఆ ఒరిజినల్ అనుభవాలు అయిపోతాయని ఒక యువ రచయిత నాతో అన్నాడు. అదీ నిజమే. పల్లెలు పట్టణాలవుతాయి. వలసలు జరుగుతాయి. జీవితాలు మారిపోతాయి.

**మీ పేరు చెప్పగానే గుర్తుకు వచ్చే కథ 'నీళ్ళు' దాని నేపథ్యం చెప్పండి.**

ఇప్పటికి చాలామంది నన్ను 'నీళ్ళు' రచయితగానే గుర్తు పెట్టుకున్నారు. ఒంగోలు, పొదిలి వంటి చోట్ల నీటి కొరత. మా స్నేహితుడు ఒకరు విజయవాడకు టెంపరరీ ఉద్యోగం కోసం వచ్చాడు. ఇక్కడ బావుల్లో నీళ్లు పైనే ఉండడం, కృష్ణా నది ఒరుసుకుంటూ పారడం తనకు అద్భుతంగా అనిపించింది. అంత గొప్పనీటి ప్రవాహం చూడటం వాడి జీవితంలో అదే తొలిసారి. రోజూ స్నానానికి వెళ్లి చాలాసేపు గడిపేవాడు. తర్వాత చచ్చిపోయాడు. మామూలుగానే అనుకోండి. ఆ నేపథ్యంలోనే 'నీళ్లు' కథ రాశాను.

**'ఇంగువ' విషయం?**

అదీ అంతే..! ఇంగువ అంటే ఏమిటి? ఎలా వస్తుంది? అని నా మిత్రుడొకడు మరీ మరీ అడిగాడు. నాకు అప్పుడు తెలియదు. కొన్నాళ్ళ తర్వాత వాడు చచ్చిపోయాడు. జీవితంలో కొన్నిసార్లు ఏవో సందేహాలు తీర్చుకోకుండానే వెళ్లిపోతామని అనిపించింది. ఇప్పుడు సన్నిహితులు కొంతమంది నన్ను 'ఇంగువ' అనే పిలుస్తున్నారు.

**'పూర్ణాహుతి' కథలోనూ పేద బ్రాహ్మడు దయనీయంగా చనిపోతాడు కదా?**

'దుర్దినం', 'పూర్ణాహుతి' వంటి కథల్లో నిరుపేద బ్రాహ్మణుల డెస్పరేట్ జీవితాలను చిత్రించాను. 'వాళ్ళు', 'దళిత బ్రాహ్మణులు'.. అలాంటి కథలు సుబ్బరామయ్య ఒక్కడే రాశారు అని ఎవరో అన్నారు.

**వ్యక్తికి కుటుంబానికి గల సంబంధం తెలిపేదే కథ అన్న నిర్వచనంతో ఏకీభవిస్తారా?**

కథ చాలా జీవితాన్ని ఒక చిన్న దర్పణంలో ప్రతిబింబిస్తుంది.

**అప్పుడు ఇతివృత్తాల కోసం హ్యూమన్ సెన్సిబిలిటీస్, జీవిత తాత్వికత వైపు పోవాలంటారా?**

అలా అయినా పోవాలి. లేకపోతే.. మధ్యతరగతి జీవితం వైపన్నా రావాలి. కథలకు ఆ జీవితం సారవంతమైన మాగాణం అని చెప్పాలి.

**నేటి సామాజిక పరిస్థితులపై మీ అభిప్రాయం?**

అందని అంతరంగాల్లో అసంతృప్తి, బాధ... ఒకప్పుడు ఎన్నో అనుకున్నాం. ఎన్నెన్నో కలలుగన్నాం. ఇప్పుడు చూస్తే చుట్టూ కాలుష్యం, మూఢ విశ్వాసాలు, తెలివి ఎక్కువ కలవారి దోపిడీ, అహంకార ధోరణులు, బలహీనులపై, స్త్రీలపై పెరుగుతున్న అత్యాచారాలు, అధికార గణం, అవినీతి, కులాల పేరుతో అమాయకుల కష్టార్జితం దోచుకుని బలపడి, తమ పలుకుబడిని రాజకీయాల్లో వ్యాపింపచేసి భ్రష్టు పట్టిస్తున్న కుటిలత్వాల విజృంభణ... అంతా అసహ్యంగా, రోతగా ఉంది. 60వ దశకం తర్వాత సినిమా భారతీయ యువతను నిష్క్రియాపరంగా మార్చివేసింది. అంతరాత్మలు లేనివారంతా సినిమాను చేజిక్కించుకుని తమ అధమ స్థాయి అభిరుచులు తీర్చుకుంటూ అదే గొప్పగా ప్రచారం చేసుకున్నారు. ఎంజాయ్‌మెంట్ పేరుతో స్టుపిడిటీ వ్యాపించింది. ఇప్పుడు టివి చానళ్లతో ఈ కాలుష్యం ఇంకా పెరిగింది. ఇది 'సాఫ్ట్ పోర్నో' తప్ప ఇంకోటి కాదు. సినిమాల్లోని వంచన, వేనిటీ రోత పుట్టిస్తాయి. లేకపోతే స్విట్జర్లాండ్‌లో పాట తీయడమేమిటి?

**మీకు బాగా నచ్చిన కథకులెవరు?**

రావిశాస్త్రి నాకు చాలా ఇష్టం. అంతకంటే గొప్ప ఆరాధనా భావం. ఆయన కార్నర్ సీట్ కథ నాకు చాలా ప్రియమైంది. శ్రీపాద కూడా గ్రేట్. ఇవన్నీ నేను చాలాసార్లు రాశాను.

**(ఇంటర్వ్యూ : తెలకపల్లి రవి)**



# అనుక్షణం

మొహమ్మద్ ఖాన్
: 9440137475

ఏ క్షణానికా క్షణం
క్షణం గడిచే కొద్దీ
వర్తమానం భూతకాలంగా మారే కొద్ది
మన అవివేకం ప్రస్ఫుటమౌతూ
మన గాలి తీసేస్తుంటుంది
ఏ క్షణానికాక్షణం
వర్తమానం
మన వివేకానికి వివేకంగా మిగిలి
మన అంతటి ఆలోచనాపరుడు
ఎవరూ లేరన్నట్లుగా
మనలో ఓ అహంకారం తలెగరేస్తుంది
ఆ మరుక్షణం
క్షణం గడిచీ గడవక ముందే
మన అమాయకత్వాన్ని
మన తెలివి తక్కువ తనాన్ని
మనమే తలచి సిగ్గుపడాల్సిన స్థితికి దేస్తుంది.
ఎంతో కాలం క్రితం
మనల్ని నేటి క్షణంతో పోల్చుకుని
అప్పుడప్పుడు
ఎంతగా మదనపడ్డామో
మరెంతగా మన అవివేకాన్ని తలచి
సిగ్గుపడ్డామో
మనకు మనమే గుణపాఠమవుతాము
గతాన్ని వర్తమానాన్ని
సున్నిత త్రాసులో తూచి
విజ్ఞానం అజ్ఞానంలో హెచ్చుతగ్గుల్ని
కచ్చితంగా అంచనావేసి తెలిపేదే కాలం
ఇవన్నీ దృష్టిలో పెట్టుకున్నప్పుడు
నేడు మనకున్న విస్తృత
రేపు మనల్ని చిన్నతనంలోకి నెడ్తుందని
ఓ అవగాహన కొచ్చి
ప్రతిరోజూ మనకొక గుణపాఠం
తప్పక నేర్పుతుందని
అలా నేర్పుతేనే అది భవిష్యత్ అని
ఎన్నో ఏండ్లు గడిస్తే గాని గుర్తించలేం!
మనం
ఏ క్షణానికా క్షణం
నిజానికి మన స్నేహితుని చేతిలో
ఓడిపోతూనే ఉంటాం
అయినా
అది, ఓటమిగా భావించం
భావించినా
స్నేహం మనల్ని బాధపడనివ్వదు
స్నేహితుడు, మనల్ని ఓడించినట్లు
ప్రవర్తించినపుడు
ఆప్రవర్తనమొక్క మూలాలు
మనల్ని మహావృక్షాన్ని కుదిపి
గాలి వాన కూకటి వ్రేళ్ళతో పెకలించినట్లు
మనకు మనం
పెకలించుకుని నేలవాలిపోతాము
ఆ బాధ
మనం ఇతరుల చేతిలో ఓడిన



బాధ కన్నా తీవ్రస్థాయిలో
మనని గాయం కాని
గాయంలా తొలుస్తూ ఉంటుంది
స్నేహం మధ్య
ఎన్నో ఏండ్ల అనుబంధాన్ని
త్రవ్వి పాతరేసినట్లుంటుంది
అయినా స్నేహమంటే ఏమిటి?
ఒకరి చేతులో మరొకరు
మహదానందముతో ఓడిపోవడమే కదా
అది, ఆ భావన
ఎదుటి వ్యక్తిలో లోపించి
విజయం సాధించినట్లు ప్రవర్తించుటే
ఈ అల్లకల్లోలానికి కారణం కదా !?

---

# నానీలు

డా. కె.జి. వేణు
9848070084

అన్ని ప్రయాణాలు
హడావుడే
చివరి ప్రయాణం
మరీ సందడి

అమ్మకు దూరంగా
ఉద్యోగం వచ్చి కాదు
ఇంటి ఇల్లాలికి
కోపం వచ్చి

దొంగలు పడ్డా
మొరగలేదు కుక్క
పోలీసులకు
పక్కా ఆదర్శమిది

భిక్షగాడి పాట
ఆపాత మధురం
అయినా వినటం లేదు
దానం చేసే బుద్ధిలేక

వర్ణం కాదు
ప్రతిభ ముఖ్యం
కోకిల స్వరం కాంతిమంతం
పావురం శాంతి పూర్ణం

ఇరాక్ సముద్రం
అల్లకల్లోలం
అమెరికా మిలిట్రీ
అల్ప పీడనంతో

సారా మత్తు కోసం
సంపాదన ఖర్చు
నిద్రమత్తు కోసం
జీవితమే ఖర్చు



# కరుణకుమార కథల్లో గ్రామీణ జీవిత చిత్రణ



డా॥ పి.వి. సుబ్బారావు

✆ 9849177594

"సన్నజీవాలు" కథా సంపుటి పేరు పెట్టడం ఉచితంగా ఉంది. సన్నజీవాలంటే బలహీన వర్గాలని రచయిత ఉద్దేశ్యం. నెల్లూరు ప్రాంతంలో సన్నజీవాలంటే గొర్రెలు, మేకలు అనే అర్థం కూడా ఉంది. భూస్వాముల దోపిడీకి, దౌర్జన్యాలకు గురై అలమటించే సన్నకారు రైతుల, వ్యవసాయ కూలీల గోడును వర్ణించే కథల సంపుటి సన్నజీవాలు.

ఆధునిక కథారచనకు మార్గదర్శకుడైన గురజాడ మార్గంలో పయనించిన గొప్ప కథారచయిత కరుణకుమార. కరుణకుమార అనేది ఆయన కలంపేరు. అసలు పేరు కందుకూరి అనంతం. ఆయన 1901లో పశ్చిమగోదావరి జిల్లా, కాపవరంలో జన్మించారు. ఉద్యోగరీత్యా నెల్లూరు జిల్లాకు వెళ్ళి ఎక్కువకాలం అక్కడే గడిపారు. ఆర్థిక పరిస్థితుల వల్ల ఆయన చదువు ఇంటర్మీడియట్‌తో ఆగిపోయింది. ఆయన ఉద్యోగ జీవితం బస్‌కండక్టర్‌గా ప్రారంభించారు. తరువాత రెవిన్యూశాఖలో గుమాస్తాగా చేరి, తహశీల్దారుగా పదోన్నతి పొందారు. తన 56వ ఏటనే మరణించారు. జీవితంలో చేదు, తీపి చవిచూసి, సామాన్య ప్రజల జీవితపు వెలుగు నీడలను కథల్లో చక్కగా చిత్రించారు. ఆయన కథలు సన్నజీవాలు సంపుటిగా ప్రచురించారు. ఆయన కథల్లో బలవంతులు బలహీనుల్ని, ధనికులు పేదల్ని, చదువుకున్న వారు చదువురాని వారిని పీల్చిపిప్పి చేస్తున్న విధాన్ని కరుణరసాత్మకంగా వర్ణించారు. ప్రత్యేకించి 'కొత్తచెప్పులు' 'బిళ్ళల మొలతాడు', 'పశువుల కొట్టం', 'కయ్యా-కాలువ' వంటి కథల్లో గ్రామీణ జీవిత చిత్రణను సన్నకారు రైతులు, రైతుకూలీలపై భూస్వాముల దౌర్జన్యాలను చిత్రించారు.

"సన్నజీవాలు" కథా సంపుటి పేరు పెట్టడం ఔచిత్యంగా ఉంది. సన్నజీవాలంటే బలహీన వర్గాలని రచయిత ఉద్దేశ్యం. నెల్లూరు ప్రాంతంలో సన్నజీవాలంటే గొర్రెలు, మేకలు అనే అర్థం కూడా ఉంది. భూస్వాముల దోపిడీకి, దౌర్జన్యాలకు గురై అలమటించే సన్నకారు రైతుల, వ్యవసాయ కూలీల గోడును వర్ణించే కథల సంపుటి సన్నజీవాలు.

కరుణకుమార 'కొత్తచెప్పులు' (1936) గొప్ప కథ. భవిష్యత్తులో రాగల దళిత చైతన్యాన్ని కరుణకుమార సరిగ్గా ఊహించారనిపిస్తుంది. ఈ కథలో ఆదిగాడు మాదిగవాళ్ళ పెద్ద. అతడు చనిపోయాక అతడి భార్య నర్సి ఇద్దరు చిన్నపిల్లలతో కూలి పనిచేసి పొట్టపోసుకొంటుంది. చేసే సంతన లేకున్నా, కులవృత్తి క్రింద ఇచ్చిన ఇళ్ళు చాలావరకు వదులుకున్నా, నాలుగిళ్ళు మాత్రం తన కింద ఉంచుకుంది. మాదిగవాడలో వాళ్ళను, వీళ్ళను అన్నా, నాన్నా అని బ్రతిమాలుకుని ఆసాములకు చెప్పులు కుట్టించి ఇస్తుంది. గ్రామంలో మోతుబరి రైతు చిన్నపరెడ్డి. అతడికి చెప్పులు చేయించి తేవడంలో నర్సి ఆలస్యం చేసింది. కారణం కొత్తచెప్పులు కరవకుండా ఆముదం రాసి తేవడానికి చేతులో డబ్బుల్లేక ఆవీధి కోమటాయన్ని బతిమలాడి ఆముదం చుక్క తెప్పించి చెప్పులకు పెట్టి తెచ్చేసరికి ఆలస్యం అయింది. చిన్నపరెడ్డి పట్టరాని కోపంతో పిడుగులు పడేట్టుగా ఉరిమి, "ఊ! నీకు ఆముదం చిక్కలేదుగా! తెస్తానన్న వేళకు తేక ఇంత ఆలక్ష్యమా? మాదిగదానికింత కావరమా? అంటూ దౌర్జన్యంగా నర్సిని అమానుషంగా ఈడ్చికొట్టాడు". చచ్చాను దేవుడా అంటూ అరచి నర్సి నేలపై కూలి కళ్ళు తేలేసింది. జరిగింది చూశాక చిన్నపరెడ్డికి తల వేడి తగ్గింది. తల్లీ, భార్య సహాయంతో నర్సి శవాన్ని వాముల దొడ్లోకి చేర్చి గడ్డివాములో దాచాడు. నర్సి పిల్లలు తల్లిని వెత్తుక్కుంటూ చిన్నపరెడ్డి ఇంటికి వచ్చారు. వాళ్ళకు "మీ అమ్మ చెప్పులిచ్చి అప్పుడే వెళ్ళిపోయింది" అని అబద్ధం చెప్పాడు. పొద్దుటి నుండి బువ్వ తినలేదని చెప్పిన పిల్లలపై కనీసం జాలి చూపకుండా, తొందరచేసి వాళ్ళను ఇంటికి పంపేశాడు. తరువాత తనకు నమ్మకస్తులైన ముతరాశి వాళ్ళకు డబ్బిచ్చి, నర్సి శవాన్ని చెరువులో వేయించి తనకేమీ తెలియనట్లుండిపోయాడు. తెల్లవారగానే శవం చెరువులోనుండి బయటపడింది. పోలీసులు చిన్నపరెడ్డిని కనీసం విచారించకుండానే వెళ్ళిపోయారు. డబ్బుతో అన్ని పనులూ జరిగిపోయాయి. నర్సి కడుపునొప్పికి తాళలేక ఆత్మహత్య చేసుకొన్నట్లు శవపంచాయితీలో తేల్చేశారు. చిన్నపరెడ్డి నర్సి తెచ్చిన కొత్త చెప్పులు తొడుక్కున్నాడు. చెప్పులకు ఆముదం బాగాపెట్టనందున చర్మం బిరుసెక్కి చెప్పులు ఒరుసుకుని రెడ్డి కాళ్ళకు పుళ్ళయి చీము పట్టాయి. రెడ్డి అశ్రద్ధ చేయటం వల్ల పుళ్ళ బాధ ఎక్కువైంది. నెలరోజులైనా ఏమేమో

వైద్యాలు చేసినా తగ్గలేదు. ఇంట్లో పరిస్థితి ఇలా ఉండగా, మూలిగే నక్క మీద తాటికాయ పడ్డట్లు చిన్నపరెడ్డి ఎద్దుల్లో ఏనుగుగున్న లాంటి ఎద్దొకటి జబ్బుచేసి మూడు రోజుల్లో చచ్చిపోయింది.

ఆదిగాడి కుటుంబానికి చిన్నపరెడ్డి చేసిన తీవ్ర ద్రోహానికి నిరసనగా అప్పటి వరకు నిస్సహాయంగా ఉన్న 'మాదిగవాడ' కసితో కళ్ళు తెరిచి సమ్మె చేసింది. చిన్నపరెడ్డి ఇంట్లో చచ్చిపోయిన ఎద్దును మోసుకుపోమని మాదిగలు నిర్మొహమాటంగా చెప్పారు. చుట్టుప్రక్కల పది మైళ్ళ దూరం పల్లెల్లో ఉన్న మాదిగ వాళ్ళందరికీ వీళ్ళే పురెక్కించి సమ్మె చేయించారు. చిన్నపరెడ్డిపై సమ్మె చేసినందుకు అతని బంధువులంతా మాదిగవాళ్ళను రూపుమాపుతామని బెదిరించి చిందులు తొక్కారు. వాళ్ళు ఎంత బెదిరించినా మాదిగలు లొంగలేదు. మాలలను చేయమని బ్రతిమిలాడాడు. ఎంత బ్రతిమాలినా మాలలూ నిరాకరించారు. మాదిగలంటే అంత అలుసా? అని మాదిగలు అగ్రకులాల వాళ్ళను నిలదీశారు. అగ్రకులాల వాళ్ళే నానాయాతన పడి, ఆ ఎద్దును భూస్థాపితం చేశారు.

రెడ్డి కాలికురుపులను పరీక్షించి, డాక్టర్ ఆపరేషన్ చేయాలన్నాడు. ఆపరేషన్ టేబుల్ మీద రెడ్డికి కొత్తచెప్పుల బుట్టతో నర్సి ప్రత్యక్షమైంది. "బాబోయ్ నర్సమ్మోయ్, నర్సమ్మోయ్, నరిసోయ్, సచ్చాన్రోయ్" అని అరుస్తూ రెడ్డి ప్రాణం వదిలాడు.

కరుణకుమార గారికి ఇష్టమైన నవల మాలపల్లి. అందులో భూస్వామి చౌదరయ్య మాలసంగమదాసుని కొట్టి చంపిన సంఘటన ఉంది. భూస్వామి డబ్బు సంచులతో కేసు మాఫీ చేయించడమూ ఉంది. కానీ అప్పటికి మాలల్లో సమ్మెచేసేంత స్పృహ లేదు. మాలపల్లి నవల తరువాత దాదాపు 15 సంవత్సరాలకు వ్రాసిన కరుణకుమార కొత్తచెప్పుల కథలో దళిత చైతన్యాన్ని రగిల్చి, వాళ్ళచేత సమ్మె చేయించి సమర్థవంతంగా చిత్రించాడు. ఆ తరువాత కొంతకాలానికి వచ్చిన కొలకలూరి ఇనాక్ ఊరబావి మొదలైన కథల్లో నిమ్నజాతుల్లో రగుల్కొంటున్న చైతన్య జ్వాలలను ప్రదర్శించారు. 1980 తరువాత ఆత్మగౌరవ స్ఫూర్తితో, ధిక్కారస్వరంతో దళిత ఉద్యమం రావడానికి నాంది కరుణకుమార కొత్తచెప్పులు కథ స్ఫూర్తి అనడం నిస్సందేహం.

**మాలపల్లి నవల తరువాత దాదాపు 15 సంవత్సరాలకు వ్రాసిన కరుణకుమార కొత్తచెప్పుల కథలో దళిత చైతన్యాన్ని రగిల్చి, వాళ్ళచేత సమ్మె చేయించి సమర్ధవంతంగా చిత్రించాడు. ఆ తరువాత కొంతకాలానికి వచ్చిన కొలకలూరి ఇనాక్ ఊరబావి మొదలైన కథల్లో నిమ్నజాతుల్లో రగుల్కొంటున్న చైతన్య జ్వాలలను ప్రదర్శించారు. 1980 తరువాత ఆత్మగౌరవ స్ఫూర్తితో, ధిక్కారస్వరంతో దళిత ఉద్యమం రావడానికి నాంది కరుణకుమార కొత్తచెప్పులు కథ స్ఫూర్తి అనడం నిస్సందేహం.**

"కరుణకుమార కొత్తచెప్పులు కథలో గొలుసుకట్టు సంఘటనల క్రమం గడుసుగా కథను పాఠకుడి ముందుంచుతూ పొగరుమోతు భూస్వామి చిన్నపరెడ్డి దురవస్థను సైతం అయ్యో పాపం అని సానుభూతి చూపించేలా చిత్రించడం కరుణకుమార శిల్పంలో భాగం".

కరుణకుమార పశువుల కొర్థం కథలో గుర్రాలకు మాలీష్ చేసే రొబ్బుడు, గడ్డి అమ్ముకుని జీవించే పెంచలి మనసులిచ్చిపుచ్చుకున్న అమాయకపు జంట. వాళ్ళిద్దరూ సంఘంలో అంటరాని వాళ్ళుగా వెలివేయబడ్డ కులానికి చెందినవాళ్ళు. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకొని పెద్దవాళ్ళ అనుమతి కోసం నిరీక్షిస్తుంటారు. వాళ్ళ పెళ్ళినాడు ఊరేగడానికి రొబ్బుడు మాలీష్ చేసే గుర్రపు యజమాని సూపరెంటుదొర గుర్రాన్ని పంపిస్తానని వాగ్దానం చేస్తాడు. పెళ్ళినాడు గుర్రమెక్కి ఊరేగాలని వాళ్ళిద్దరూ ఊహాలోకాల్లో విహరిస్తుంటారు. పెంచలి ఒకనాడు గుర్రానికి గడ్డి తెచ్చి, రొబ్బుడితో మనసువిప్పి ఊసులాడుకొని, తిరిగి వస్తుండగా, జడివాన వట్టింది. తలదాచుకోవడానికి పెంచలి ఒక పశువుల కొట్టంలో చేరుతుంది. ఆ కొట్టం ఆ వూరి భూస్వామి రాయుడిది. అతడెన్నాళ్ళనుంచో పెంచలి మీద మోజు పెంచుకున్నాడు. తన జీతగాడు సుబ్బడ్ని పంపించి, పెంచలిని తన దగ్గరకు రప్పించుకొని బలాత్కరించబోయాడు. పెంచలి అతడితో పెనుగులాడి అతని బారి నుండి తప్పించుకొని ఇల్లు చేరుతుంది.

పెంచలి బావరోశిగాడికి ఆవిడ తనను కాదని రొబ్బడిని పెళ్ళి చేసుకోవాలనుకుంటుందని కోపం. పెంచలి, రొబ్బుడు పెళ్ళినాడు గుర్రమెక్కి ఊరేగాలనుకుంటున్నారని ఊరిపెద్దలను రెచ్చగొట్టాడు. పెంచలి తనకు లొంగలేదని రాయుడు ఆమె పెళ్ళి చెడగొట్టాలనుకుంటాడు. పశువుల కొట్టంలో పెంచలి తన వశమైందని రాయుడు ఊళ్ళో పుకారు పుట్టించాడు. ఇంకా ఆమెకు రోశిగాడితో కూడా సంబంధం ఉందని ప్రచారం చేశాడు. ఈ అపవాదులు నమ్మి, రొబ్బుడు పెంచలిని చచ్చేట్లు కొట్టి, అవమానించి వెళ్ళగొడతాడు. పెంచలి మతిభ్రమించి పిచ్చిదైపోయింది.

భూస్వాముల క్రౌర్యానికి బడుగు కష్టజీవుల ప్రణయగాధ పశువుల కొర్థం. "పేదవారి బతుకులతో ఆటలాడుకునే భూస్వాముల దౌష్ట్యాన్ని రోశిగాడి లాంటి అసూయపరులు స్వార్థంతో ఇతరుల బతుకుల్ని నాశనం చేయటాన్ని కరుణకుమార కథలో సహజసిద్ధంగా చిత్రించాడు.

'కయ్య – కాలువ కథ'లో కొండడు అనే హరిజనుడు తన పొలానికి నీరు పారించుకోవటానికి కాలువ కోసం తాపత్రయపడి, తపించి భూస్వామి కోపానికి బలైపోవడాన్ని కరుణకుమార కరుణరస భరితంగా చిత్రించాడు.

లక్ష్మమ్మ అనే మోతుబరి ఆసామి భర్త చనిపోయిన తరువాత మెట్టినింటి ఆస్థికి, పుట్టినింటి ఆస్థికి తానొక్కతే వారసురాలయింది. ఉన్నదిచాలదన్నట్లు ఆ ఊళ్ళో ఇతరుల ఆస్తులను కాజేయాలని చూస్తుంటుంది. తన అక్క కొడుకు రామిరెడ్డిని దగ్గరకు తీసి ఆస్తి ఆశపెట్టి అక్రమాలు చేయిస్తుంది.

కొండడనే హరిజనుడికి సాగుచేసుకోవటానికి సర్కారు యాభై సెంట్లు కయ్యను పట్టా రాసిచ్చింది. వాడెంతో కష్టపడి, డబ్బు ఖర్చుపెట్టి మరమత్తు చేస్తేకానీ ఆ కయ్య సాగుకు వచ్చేది. వాడి కయ్య లక్ష్మమ్మ గారి నూరెకరాల ఏకఖండపు పొలానికి పక్కనే ఉంది. ఆ కయ్యను

తనపేర రాయించుకోవాలని లక్ష్మమ్మ భర్త ఉండగా కొంతడబ్బు కూడా ఖర్చుపెట్టాడు. అది తనకు కావాలని లక్ష్మమ్మ బేరమాడుతుంది. కొండదు నిజాయితీగా కయ్యు మరమ్మత్తుకు పెట్టిన ఖర్చు తనకిస్తే ఇస్తానంటాడు. కొండదు న్యాయంగా తాను పెట్టిన ఖర్చు అడిగినందుకే వాడికి దురాశని తిట్టిపోసింది. తరువాత వాడి మీద పగ సాధించటానికి పూనుకుంది. తన పొలంలో దొంగతనం చేశాడన్న నేరాన్ని ఆరోపించి, కరణాన్ని, మునసబును పురికొల్పి, వాడికి జరిమానా వేయించి వాడి బర్రెగొడ్డును జప్తు చేయించింది.

**కథల్లో గ్రామప్రజల అజ్ఞానాన్ని, భయాన్ని, మూర్ఖత్వాన్ని, గ్రామాధికారుల నిర్లక్ష్యవైఖరిని, కష్టం తమదాకా వస్తే పడేపాట్లను 'అంటుజాడ్యం' కథలో రచయిత శక్తివంతంగా వివరిస్తాడు. గ్రామాల్లో అజ్ఞానం, భయం, మూర్ఖత్వం ముప్పేట పెనవేసుకొని ఉంటాయి. చీకటి గుయ్యారం వంటి వాళ్ళ బతుకుల్లో భయం పెద్ద శత్రువు. మూఢనమ్మకం వాళ్ళపాలిట శాపం.**

కొండడి పొలం మెరక కావటం చేత నీళ్ళెక్కక రెక్కలు ముక్కలు చేసుకున్నా ఫలితం దక్కలేదు. చివరకు లక్ష్మమ్మ పొలంలో నుండి కాలువ ఇమ్మని ప్రాధేయపడతాడు. ఉచితంగా కాకపోతే డబ్బులిస్తానని వేడుకుంటాడు. ఆమె ససేమిరా వీలుకాదనడంతో ప్రభుత్వానికి అర్జీ పెట్టుకుంటాడు. రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ కొండడి దగ్గర లంచం కాజేసి కూడా లక్ష్మమ్మకే అనుకూలంగా పనిచేస్తాడు. కొండదు కష్టపడి పండించుకున్న వరికుప్పను తగలబెట్టించి వాడిని సర్వనాశనం చేస్తుంది. కయ్యు - కాలువ కథలో భూస్వాములకు, పేద రైతులకు నీటి తగాదాలు రావటం, రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లు, నీటి సంబంధమైన అధికారులు ఎప్పుడూ భూస్వాముల పక్షమే వహించటం ఇప్పటికీ మన సమాజంలో జరుగుతున్న అన్యాయం. నక్సలైట్లు పేదల పక్షం వహించి, భూస్వాముల్ని హత్యచేసిన సందర్భాల్లో భూస్వాములు భయపడినా సమస్యలు పరిష్కారం కావటం లేదు. భూస్వాముల రక్షణ కోసం వచ్చిన పోలీసులు పేదరైతుల్ని చిత్రహింసలు పెడుతున్నారు. సన్నకారు రైతులు రైతుకూలీలు సంఘటితమైతే తప్ప ఇటువంటి సమస్యలు పరిష్కారం కావు.

కుణకుమార కథల్లో గ్రామీణ జీవితాన్ని అద్భుతంగా చిత్రించిన గొప్ప కథ 'బిళ్ళల మొలతాడు'. కృష్ణారెడ్డనే భూకామందు ఇంట్లో సుబ్బదు పాలేరు. కృష్ణారెడ్డి కొడుకు రామిరెడ్డి, సుబ్బదు ఒకే ఈడువాళ్ళు, సుబ్బదు వ్యవసాయంలో మంచి పనివాడు. వాడికి చాతగాని పనిలేదు. కృష్ణారెడ్డి భార్య లక్ష్మమ్మ సుబ్బడిని కన్నబిడ్డలాగా చూసుకుంటుంది. సుబ్బడి మేనమామ వాడికి పిల్లనిస్తానని చెప్పి పంపాడు. లక్ష్మమ్మ సుబ్బడి పెళ్ళి సంగతి తెలిసి ఎంతో సంతోషించింది. కొత్త దంపతుల కాపురానికి వేరుగా ఇల్లు కట్టించి ఇస్తుంది. పెళ్ళికూతురికి బంగారు నగలు చేయించి ఇస్తుంది.

సుబ్బడికి కాబోయే భార్య రమణి చదువుకొన్నది. వాళ్ళ పెళ్ళికి యానాది సంఘాధ్యక్షులు వెన్నెలకంటి రాఘవయ్య ఇంకా ఇతర నాయకులు, సంఘ సంస్కర్తలు, ఉపాధ్యాయులు వస్తారు. ఆమెకు మహాత్ముడి ఆత్మకథను ఉన్నవ వారి 'మాలపల్లి' నవలను కానుకలుగా ఇస్తారు. రమణి తాను స్వయంగా వడికిన నూలుతో తన మామకు పంచె, ఉత్తరీయం, తనకు చీర, రవిక నేయిస్తుంది.

పెళ్ళి చేసుకొని కాపురం పెట్టాక భర్త చేస్తున్న చాకిరీ చూసి రమణి బాధపడుతుంది. సుబ్బడి పెళ్ళి సమయంలో రామిరెడ్డి ఊళ్ళో లేదు. కొన్నాళ్ళ తరువాత రమణిని చూసి, ఆవిడ అందచందాలకు ఆకర్షితుడౌతాడు. సుబ్బదు ఇంట్లో లేని సమయం చూసి, రమణిని బలత్కరించబోతాడు. రమణి అతడిని దూరంగా నెట్టేసి తప్పించుకుంటుంది. గుడ్డి వెన్నెల్లో ఆవిడ మహాత్మాగాంధీ పటం ముందు మోకరిల్లుతుంది. మహాత్ముడు ఆమె వీపు నిమిరి "అమ్మా నీవు నా కన్నతల్లివి" అని లేవనెత్తి దగ్గరకు తీసుకుంటాడు. 'దారిద్ర్యం కంటే భయంకరమైనది పిరికితనమని తెలుసుకోవలసినదిగా మహాత్ముడామెకు ప్రబోధిస్తాడు'. తరువాత ఆవిడ మనఃశ్శాంతి కోసం మహాత్ముడి ఆత్మకథ, ఉన్నవ వారి మాలపల్లి నవల చదువుకుంటుంది. భర్తతో జరిగిన సంగతి చెప్పి భయపడి "దేహి అంటే బలవంతులు నెత్తిపై అణగదొక్కుతారు. నిలదొక్కుకొని ఎదురుతిరిగితే కాలుకదపలేరు - పిరికిపందలు" అని ధైర్యంగా ఉండమని ప్రబోధిస్తుంది.

రామిరెడ్డి పట్టువదలని విక్రమార్కుడిలాగా రమణికి డబ్బు ఆశచూపి లొంగదీసుకునే ప్రయత్నం చేస్తాడు. అతడి బాధ పడలేక రమణి భర్తను ఒప్పించి, తన పుట్టింటి ఊరికి వెళ్ళిపోతారు. రమణి పుట్టింటి వాళ్ళ ఊరు కమ్మవారి పాలెంలో దేవుడి మాన్యం భూమి వివాదంలో ఉన్నందున ప్రముఖ న్యాయవాది రాఘవయ్య భూమివాదం తేలేవరకు ఆ భూమి కౌలురైతుగా సుబ్బడి పేరుమీద కోర్టుచేత రాయిస్తాడు. రామిరెడ్డి ఆ భూమి తనపేరు మీద రాయమని సుబ్బడిని ప్రలోభపెట్టాడు. వాడు లొంగకపోయేప్పటికి, తన బిళ్ళల మొలతాడు వాడు కాజేసినట్లు వాడిపై అబద్ధపు కేసు పెట్టించి చితకబాదించాడు. కోర్టులో సుబ్బడి తరుపున రామిరెడ్డి తల్లి లక్ష్మమ్మ సంచలనాత్మకమైన సాక్ష్యం చెప్పింది. కాశీయాత్రలో తన ప్రాణాలు కాపాడిన సుబ్బదు తన రెండో కొడుకని, వాడి భార్య రమణి తన రెండో కోడలని చెప్పింది. వాడికి బిళ్ళల మొలతాడు తానే చేయించానని, వాడికి తానెంత చేసినా, వాడి ఋణం తీర్చుకోలేనని చెప్పింది. కోర్టు కేసు కొట్టేసిన తరువాత లక్ష్మమ్మ తాను కూడా యానాది సంఘంలో చేరుతున్నానని సుబ్బదు, రమణి వెంట వాళ్ల ఇంటికి వెళ్ళింది. కన్న కొడుకును విడిచిపెట్టి, లక్ష్మమ్మ యానాది సంఘంలో చేరడం ఆమె మానవతా దృక్పథానికి, సంస్కరణ భావాలకు నిదర్శనం.

పొలం పనులను, పల్లెటూరి ప్రజల సుఖదుఃఖాలను, అనుబంధాలను సంఘం మారుతున్న తీరును ఈ కథలో కరుణకుమార వివరించారు. మహాత్ముడు రమణితో మాట్లాడి ఓదార్చడం, లక్ష్మమ్మ యానాది సంఘంలో చేరడం వంటి సన్నివేశాలను రచయిత కల్పించి సంఘం మారవలసిన తీరును సూచించాడు. రచనలో ఉదాత్తపాత్ర

# నల్లబల్ల

నాలుగు గోడల మధ్య
దేశ భవిష్యత్తుకు పునాదులు పరుస్తు
ఓ అనాధికార శాసనకర్త యేలే రాజ్యమే
నల్లబల్ల.
పొద్దంతా సుద్ధముక్కతో
సుతిమెత్తని గాయాలు తింటూ
తనను నమ్మినవారికి ద్రోహం చేయకుండా
ఉన్నత శిఖరాలను అందుకునేలా చేస్తుంది.
తన తనువెప్పుడూ నలుపే ఐనా
పలికే మాటలన్నీ తెలుపే
అందుకు నిదర్శనంగా
ఎల్ల చరిత్రలను
తన తనువెల్లా బస్మంలా పూసుకుంటూ
తన జీవితాన్ని సార్ధకం చేసుకుంటుంది.
తరగతి గదిలో నిలబడి
ఒక్కసారి నల్లబల్ల ముఖం చూడగానే
అప్పుడెప్పుడో
ఆడి, పాడిన వయసును అటకెక్కించిన నాబాల్యం
మళ్ళీ కళ్ళ ముందు తళుక్కుమంటుంది
మదిలో తెలియని స్మృతిపథం
నన్ను ఒక కుదుపు కుదిపేస్తుంది
చీకటిమయమైన తన బ్రతుకును తలుచుకొని
అప్పుడప్పుడు
లోలోనే కుమిలిపోతుంది పాపం
అందుకు కృతజ్ఞతగా
తనవంటి దుస్థితి ఎవరికీ రాకూడదని
జీవితమంతా
భావితరాలకు ధారపోస్తూనే వుంటుంది.
నల్లబల్ల అంటే
తరగతిగది ముఖానికే నుదుటి తిలకం
వయోభేదాలు లెక్కచేయకుండా
అందరినీ సమ వయస్కులుగా చూసే
స"హృదయపలకం"
నల్లబల్ల కనపడితే
చేతులు జోడించి తలవంచి కృతజ్ఞత చెప్పాలనిపిస్తుంది
ఎందుకో తెలుసా...!
జీవితాంతం తన వెంటే నడిచే
ఒక "ఉపాధ్యాయుని"గా నన్ను తీర్చిదిద్దింది కనుక...!!

- సుప్పని సత్యనారాయణ
✆ : 9492626910





చిత్రణ, నిరాడంబరత, ఆదర్శవాదం, పాఠకుల మనస్సుకు హత్తుకుంటాయి.

కథల్లో గ్రామప్రజల అజ్ఞానాన్ని, భయాన్ని, మూర్ఖత్వాన్ని, గ్రామాధికారుల నిర్లక్ష్యవైఖరిని, కష్టం తమదాకా వస్తే పడేపాట్లను 'అంటుజాడ్యం' కథలో రచయిత శక్తివంతంగా వివరిస్తాడు. గ్రామాల్లో అజ్ఞానం, భయం, మూర్ఖత్వం ముప్పేట పెనవేసుకొని ఉంటాయి. చీకటి గుయ్యారం వంటి వాళ్ళ బతుకుల్లో భయం పెద్ద శత్రువు. మూఢనమ్మకం వాళ్ళపాలిట శాపం.

పాలెం గ్రామంలో పొరుగూరు నుండి నారుకోసం వచ్చిన రైతు స్పృహతప్పి ఒక చెట్టు క్రింద పడిపోయాడు. పొలం వెళ్ళి వస్తున్న మోతుబరి రైతు సుబ్బారెడ్డి అతడికి కలరా సోకిందన్న అనుమానంతో ఊళ్ళో నుంచి తరిమేశాడు. జబ్బుతో ఆ రైతు దాహంతో తపిస్తూ, డొంకలో చెట్టుక్రింద పడిపోయాడు. అతడు కలరావల్ల చనిపోయాడన్న అనుమానంతో అతడి దగ్గరకు వెళ్ళడానికి కూడా భయపడి మునసబు, కరణాలకీ విషయం తెలిసి కూడా పట్టించుకోరు. వాడికి శవపంచాయితీ జరపవలసివచ్చిందని తమ అవస్థకు తమను తావే నిందించుకుంటారు. పోలీస్‌స్టేషన్‌కు కబురు తీసుకువెళ్ళవలసి వచ్చిందని గ్రామనౌకరు విసుక్కుంటాడు.

ఆ రాత్రికే మునసబుకు వాంతులు, విరోచనాలయ్యాయి. కలరా సోకిందని భయపడి, సోకాలు, శాపనార్థాలు పెడతాడు. తెల్లవారిన తరువాత పోలీస్ ఇన్‌స్పెక్టర్ శవపంచాయితీకి వస్తాడు. కరణం, మునసబు వచ్చి చెట్టుకింద పడిపోయిన వ్యక్తిని చూడగా, వాడు 'దాహం' అని సైగచేస్తాడు. అందరికీ ఆశ్చర్యం వేసింది. "వీడు చావలేదయ్యా! బతికే ఉన్నాడు. భలేపని చేశారు కదయ్యా! వీడికిన్ని గంజినీళ్ళు పోయించి ఊళ్ళోకి తీసుకుపొండని" చెప్పి ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయాడు. రోగి చావలేదని కరణం వచ్చి చెప్పగానే తనకొచ్చిన రోగం ఏమయిందో మునసబు ఎగిరి గంతేశాడు.

కరుణకుమార కథకు ముందు మాట రాసిన మల్లంపల్లి సోమశేఖర శర్మ నేడు తెలుగులో చాలా కథలు వస్తున్నాయి. కానీ అవి సాధారణంగా పట్నవాసపు జీవితాల్నే వర్ణిస్తున్నాయి. పల్లెటూరి పొరుగుకైనా పోవడం లేదు. ఈ విధంగా పట్టణాలకే ప్రాధాన్యం కలిగి, రాజకీయ కారణాల చేత వెనుకబడిపోయిన గ్రామం, గ్రామస్థులు, సాహిత్య రంగంలో వెలి అయిపోయినారు. నోరులేని పల్లెటూరి కష్టజీవిని గమనించేవారు, అరుదు. ఈ స్థితి కొంచెం మారాలి అన్నారు. కరుణకుమార కథలు గ్రామీణప్రజల కష్టసుఖాలను తెలిపినందుకు, ప్రజలలో పల్లెటూరి భాషను ఉపయోగించినందుకు మల్లంపల్లి వారు ప్రశంసించారు.

మందలపర్తి కిషోర్ కరుణకుమార కథలను ప్రశంసిస్తూ, తెలుగునాట పడగలెత్తి బుసకొట్టే భూస్వామ్య విషసంస్కృతిని కరుణకుమార తీవ్రంగా నిరసించాడు. తన కథల ద్వారా నిలదీశాడు" అన్న మాటలు ఆమోదయోగ్యాలు.



# దరువు

సిరికి స్వామినాయుడు
✆ : 9494010330



తూరుపు మంచె మీద బద్ధకంగా తొంగున్న సూరీడ్ని ఒక తాపుతన్ని
అతడు, అడవి తల్లి ఒడిలోకి పరుగుదీస్తాడు !
అతని రాకనెలా కనిపెడతాయో గానీ... పిట్టలన్నీ
అతన్ని చుట్టంలా పలకరిస్తాయి !
అంతటి క్రూరమృగాలా... అవి మచ్చికపడ్డ లేడికూనలై
అతని ముందు మోరదించుతాయి !

చీకటికి చితిపెట్టినట్టు, అతడు కాల్చిన పోడుమంట
రేపటి ఆశల వెలుగురేఖల పోరుమంటలాగుంటుంది!
తెల్లారి, రెక్కలల్లారుస్తూ కొండను చల్లార్చి
ఆదివాసీ శోకమూర్తుల్లాగున్న మోడుల్ని నరికి
గోడకట్టినట్టు, కొండరాళ్లతో పోడుమడికి గట్లుకడతాడు!
చుట్టూరా పచ్చదనమున్నా, బతుకులో పచ్చదనం లేని
అతన్ని చూసి, కన్నీరు మున్నీరై కురిసిపోతుంది మబ్బు !
మెలికలు తిరుగుతూ పరుగెడుతుంది వాగుపాము !

ఆకుపచ్చని ఆకాశం మీద పసుపుపచ్చని చుక్కల్లా... కందిపూలు!
చేతికందికొచ్చిన కొడుకులా... ఏపుగా ఎదిగిన చేను చూసి
'యీ యేడాది షావుకారప్పు తీరిపోద్ది గావాలా'ను కుంటాడా..!
తీరా కావిడేసి మోసుకొచ్చిన కొండ, కాటాగుండుకు సరితూగదు!
ఉప్పుగాల్లో, కిరసనాయిలో, ఎదానకొట్టి
తక్కెడ కోరల తోడేల్లు, కొండను నోట కరుచుకుపోతే...
పంజా దెబ్బకు దొరికిపోయిన కొండ మేకలా గింజుకుపోతాడు!

అతని దుఃఖాన్ని చూసి, చింత చెట్టు తన చెంగు దులిపి
పుల్లని నెలవంకల్ని రాలుస్తుంది !

తనువు చీల్చుకొని, తొనలై దొన్నల్లో యిమిడి పోతాయి పనసపళ్లు !
ఆరముగ్గిన సీతాఫలాలు, పెళ్లికూతుళ్ళకావిడ గంపల్లో కూర్చుంటాయి !
కొండాకోనా ఎక్కీదిగీ, కావుళ్లతో సంతకు పోతుంటే,
దారిలో వెదురుపొద, అతని చెవిలో ఏ రహస్యం చెప్పిందేమో కానీ...
సంతలో మళ్లీ, పళ్లీసుపెడుతూ చుట్టుముట్టిన
తోడేళ్లమంద మీద ఒకటే దరువు !
వెదురువనం దెబ్బకు అదిరిపడింది భూమి !
అడవిలో ఫక్కున నవ్విందో పువ్వు ! విప్పసారా ఘుమఘుమలతో
కందికొత్తల పండగ నాహ్వానిస్తూ... అడవి !!

---

# తస్మాత్ జాగ్రత్

డా. ఈదూరు సుధాకర్
✆ : 9347109266



మీకు 'కరెంటు' తెలుసా
మాకు 'ఎలిగే బలుబు' తెలుసు
మీకు 'గ్యాసు' తెలుసా
మాకు 'మండే మంట' తెలుసు
మీకు 'డీజిల్' తెలుసా
మాకు నడిచే ఇంజెను తెలుసు
జీవ సహజీవనం మాది
యంత్ర జీవనం మీది
కరెంటు, గ్యాసు, డీజిలు
విలాసాలు మీకు
నిత్యావసరాలు మాకు
యఫ్.డి.ఐ మార్కెట్లలా
ఉప్పు పప్పులతో
మీ స్విస్ అకౌంట్లు తెరుచుకుంటున్నాయి
మా లైఫ్ అకౌంట్లు మూసుకుంటున్నాయి
తాత్కాలిక ధన వర్తమానం మీది
శాశ్వత జీవ భవిష్యత్కాలం మాది
హెచ్చరిస్తున్నాం...!!
మళ్లీమేం బానిసలం కాలేమని
నినదిస్తున్నాం..!!
ఇంక్విలాబ్ జిందాబాదని
ఇంటింటా మే భగత్సింగులమని
తస్మాత్ జాగ్రత్త

కథ

# పాపం ఈరిగాడు



సడ్లపల్లె చిదంబరరెడ్డి

✆ : 9440073636

**జ**తగాళ్లు సెప్పులు మెట్టుకొన్నట్లుగాని, కాళ్లకి సెప్పులు ఉండల్ల అని గాని ఈదిబడి సదివేటపుడు ఈరిగానికి తెలీదు.

పెద్దిసుకూలుకు సేర్తూనే- అది ఈరిగాని ఊరికి రెండు మైళ్ల దూరము. మధ్యాన్నం సంగటి తినేకి ఇంటికొచ్చిపోవల్ల. అగ్గినిప్పులు పొంగినట్లుండే రోడ్ల నడిసేకి శాతగాక (రోడ్లో) వారం దినాలకే సెప్పులు ల్యాకుండ ఇసుకూలుకు పొయ్యేల్లేదని మొండికేశ.

ఈరిగాని తండ్రి యంగటయ్య. దండిగా బూములండే షావుకారిగాడు. అసలు బూములే లేని బికారోడూ గాదు. రెండెకరాల సవిటి పేదుండే సన్నరైతు. వానలు కురిస్తే సేన్లో పన్లు సేసుకొంట, ల్యాకుంటే కూలీ నాలీ సేసుకొంట పెండ్లాము బిడ్డలకి ఇంత కడుపు నింపేదానికి, నానాతంటాలూ పడ్తుంటాడు. అట్లావోడు కొడుక్కి సెప్పులెట్ల తెచ్చిస్తాడు?

''ఒరేయంగిటిగా సదువుకు పోతావేమిరా? అని మాయప్పుడు ఒగుమాట అనింటే, నేనెంతో సదువుకొంటావుంటి. ఆ ఎర్రికాలంలో మాయప్పుడు నాతో ఆ మాట అన్లేదు. మీ అన్నయ్య తిమ్మగాన్ని సదివిస్తామంటే సేతిలో సిల్లిగవ్వ ఉండ్లేదు. దానిజతకి కూటికి జరగని కరువుకాలము. అందుకేవాన్ని పెద్దరెడ్డోల్లింట్లో ఎనుముగొడ్లు కాసేదానికి పంపాల్సొచ్చె. నీకన్నా నాలుగచ్చురాలు రావల్ల అని బట్టలకి, బుక్కులకి అప్పుల్జేసిండా. దాని జతకి మారాజుల మాదిరి సెప్పులు కావల్లంటె నేను యాడదెత్తు" అని యాష్టసేసుకొనె.

ఇంట్లో అందరూ కడుపులు గట్టి, కూలీనాలీ సేసుకొంట కష్టంపడేది పండెండ్లేండు నిండిండే ఈరిగానికి తెలీందేమీ కాదు. అయినా అందరి పిల్లోల్ల మధ్యన 'లేని' వాని మాదిరి ఉండేదానికి శాతగానోడు. బాగా సదవల్లని ఆశపడ్తావుండేవోడు.

యంత మురిసిపోవల్లని దావలో నడిసేటవడ, అయ్యవారు సెప్పిండే పద్యాలు, అర్తాలు గుర్తుకు తెచ్చుకొనేదానికి పోయినా "సెప్పుల్లేవు" అనే ఎలితి మాత్రం మరిసేకి అయితా వుండ్లేదు.

ఇట్లే ఒక యాడాది గడ్సిపాయ.

ఈరిగానికి వాళ్ల కలాసులో అందరికంటే శానా మార్కులొచ్చె. దానికి "బోమానం" గూడా ఇస్తారని తెలుస్తూనే- వాడు ఎగిరి దుమికి ఆనందంలో మునిగిపాయ. అట్లాటవడ వాడు నిద్దర్లో గూడ కలవరించే సెప్పులు "బోమానం"గా ఇచ్చింటే, యట్లున్నోగాని - వానికి యంత మాత్రమూ అర్తంకాని ఇంగిలీసు బుక్కును ఇచ్చిరి. యావిదైతే ఏమి? బొమానం బొమానమే!! ఆనందం ఆనందమే !!

పెద్దమీటింగులో అయిద్రాబాదు నుంచి వొచ్చిన మంతిరి సేతుల్తో బొమానం అందుకొన్న ఈరిగాడు - యంత బిరీన ఇంట్లో అందరికీ సెప్పుదామని యల్బార్నో అంత యనకబడిపాయ. సంగతి ఇంట్లో సెప్పి- వాళ్లని అబ్బురంలో ముంచేయల్ల అనుకొన్న వాని ఆశలు అడియాసలయిపాయ.

ఇసుకోల్నుండి రోడ్లోకి రాకున్నట్లే కాలికి ముల్లుకుచ్చుకోని రగతం ఒక పక్క, కందుల్లో నీళ్లు ఒగ పక్క కారబట్టె. అట్లే కుంటుకొంట ఇంటికొచ్చె.

అంతసేపటికి ఇంట్లో అందరికీ బోమానం కత తెలిసిందె. దాని మీద అందరూ మాట్లాడేది గూడ ముగిసిపోయింది.

బుక్కులు తీసి మూలకి పారేసి, పాము కర్సినట్లు 'జివ్వు'న పీకుతావుండే కాళ్లీడ్సుకోని, పొయ్యిగడ్డ దగ్గరికి పాయ కాపడం పెట్టుకొనేదానికి.

* * *

ఈరిగాని అన్న తిమ్మగానికి పెండ్లాయ.

యాడో పుట్టి పెరిగి ఈ పొద్దు ఈటికొచ్చిండే వదినె కాళ్లకుండే సెప్పుల్జూసి- ఇంట్లో ఇంత లావు పెండ్లి జరిగి సెప్పులకి గతిలేదని ఈరిగాడు అంగలార్సుకొంట- ఆయమ్మవి సెప్పులేసుకొని పొయ్యేదానికి మొదలు పెట్టె.

దానికి ఆయమ్మ అలిగి పనులుసేయకుండ పండుకొనె.

ఈరిగాడు ఇడ్సిపెట్లేదు.



సిలికి సిలికి గాలివాన అయినట్ల తిమ్మగాని సేత్లో వొదినె ఏట్లు తిన్నప్పుడు గాని ఈరిగానికి సెప్పుల మీద ఆశ తీర్లేదు.

కడాకి పెద్దపరీచ్చల్లో ఈరిగానికి మార్కుల దండిగా ఒచ్చిండివని గవుర్మెంటోళ్లు దుడ్లిచ్చిరి.

దుడ్లు, సంపాదించిన కొడుకును జూసి తండ్రియంగటప్ప శాన సంబరపడి. కొడుక్కు కోరిన సెప్పులు తీసిచ్చి కాలేజీలో సేర్పిచ్చె.

కొత్త సెప్పులు కాళ్లకి మెట్టుకోమంటే కదలాడతావుండే పాము శర్మం మీద నున్నగా జారినట్ల ఈరిగాడు ఆనందం పడిపోయా. గాంధీ తాత కాళ్లకి ఉండే అట్ల సెప్పుల్లో కనబడేవి తన కాళ్లేనా అన్నట్టు సిగ్గుపడుకొంట నడుస్తావుండె

నాలుగు జన్మల నుంచి తీరకుండావుండే కోరిక తీరినట్లు- ఊర్నుంచి నాలుగు మైలీల దూరాన్ని నాలుగు నిమిషాలకే నడిసినట్లు కాలేజీకి నడిసిపోతావుండె.

ఇట్ల కొన్నాళ్లు జరిగిందోలేదో పక్కూర్లో సుట్టాలింట్లో పెండ్లి. ఇంట్లో అందరికీ సేనిపన్లుంటే ఈరిగాడే పోవల్సొచ్చె.

పెండ్లి పందిరి అవతల్నే అందరూ సెప్పులిడ్సి లోపలికి పొయ్యి కూకొంటా వుండ్రి. అయితే ఈరిగానికి మాత్రం ఆడసెప్పులిడస బుద్దికాలేదు.

యాలంటే-వాళ్లందరికీ అవి సెప్పులేకావొచ్చుగాని, వానికి మాత్రం అవి సెప్పులు కాదు. యన్నో ఏండ్లు తపస్సుచేసి సంపాదించిన వరాలు. నేస్తగాళ్లకు మించిన జతగాల్లు. కాళ్లను కాపాడే కవశాలు. అందుకే నెట్టగా పందిరిదంకా మెట్టుకుపాయ.

పొయ్యేకేమో పొయ్యిండాడు కాని, ఆడ అందరి మధ్యకూకోనేకి కాలేదు. అందరూ వాని సెప్పుల్నే సూస్తావున్నట్లనిపించె. ఎవరు ఏల మాట్లాడినా "ఏంరా ఈడదంకా సెప్పులేసుకోని ఒచ్చిండావు?" అని అడిగినట్లనిపిచ్చె. మెల్లగా లేసి అవతల ఇడిసొచ్చె. ఒగ కన్ను సెప్పుల మిదే ఏసి కూకోనుండె.

ఇన్తకేస్తే రాల్నంత జనం సేర్రి. పెండ్లయిపాయ. బువ్వల్తింటూనే ఒగర్నొగరు నూకుబట్రి. ఎవరి సెప్పులు వాళ్లేసుకొని పోబట్రి. ఈరిగానికి మాత్రం వాని సెప్పులు కనిపిచ్చలే. ఆత్రపడి ఎదకబట్టే. వానివి కాని రకరకాల సెప్పులు 'శాతనయితే నీ సెప్పులు ఎదుక్కోసూస్తాము' అని ఎక్కిరించినట్ల కనిపిస్తావుండె. వాని గుండెలో రాయి పడినట్లాయ. సేతిలోని కబళం నోటి కందకుండ జారిపోయనట్లాయ. కాళ్లుగాలిన పిల్లి మాదిరి తిరుక్కొంట అందరి కాళ్లనీ సూడబట్టే- యాడావాని సెప్పులు కనిపిచ్చలే.

సెప్పుల్లేకుండ కాలేజీకి ఉత్తకాళ్లతో యట్లబోవల్ల? ధైర్యం సేసి తను గూడా ఒక జత సెప్పులు దొంగతనం సేస్తే? ఎవరన్నా సూస్తే? అయ్యో తలకాయ తీసి యాడబెట్టుకోవల్ల? అని మనసులోనే అనుకొని అట్లా శద్దవని ఒద్దనుకొని కాళ్లీడ్సుకొని ఇంటికియల్బారె.

అది యండకాలము. మద్యాన్నం రెండు గంటలపుడు యండ తల మింద నిప్పుల మాదిరి కురుస్తావుంది. దుమ్మురేగిండే నల్లరేగడి నెల్లో అగ్గి పొంగుకో నొచ్చినట్లుంది. అడుగుతీసి అడుగు పెడతావుండే దేవుడు కనిపిస్తావుండాడు. మండిపోతావుండే పాదాలకి ముండ్లు కాదు గాని సన్నరాయి తగిల్నా ఎర్రగా కాల్సిన ఇనుప సలాకు దిగ్గొట్టినట్ల ప్రాణాలు తనుకులాడ్తావుండివి. బాధని పండ్ల కింద బిగబట్టుకొని మెల్లగా ఇల్లు సేరుకొనె.

* * *

ఒగ దినము పుట్టిన్రోజు పండగని ఒక జతగాడు పిలిశ ఈరిగాన్ని, వాడు దండిగా దుడ్లుండేవోడు. ఈరిగాడంటేశానా ప్రాణాలిడుస్తాడు. అందుకే ఈరిగాడు పోదామనుకొనె.

యనకటికి ఒగాయప్ప శానా ఏండ్లు తపస్సు సేస్తే దేవుడు పత్యచ్చమాయనంట. తాను ముట్టిందంతా బంగారు కావల్ల అని ఆయప్ప దేవున్ని వరమడిగినంట. దేవుడు అట్లే అవుతుందని వరమిచ్చి ఒగ నియమం బెట్టినంట. అది ఏమిటిదంటే- బంగారుగా మారల్ల అని ఏవస్తువును ముట్టుకొంటావో అపుడు

## మోడూ... చిగురిస్తుంది

- శ్రీమతి చెల్లెపిళ్ళ శ్యామల
✆ : 9949831146



రెక్కలు టపటపలాడిస్తూ
పక్షులన్నీ ఒకే చెట్టు పైకి
చేరుకున్నాయి !
కలవడం లోని ఆనందం
చెట్టు కూడా పంచుకున్నట్లు
కొమ్మలు చిరుగాలులు
పంచుతున్నాయి !
విజయం కోసం
బారులు తీరి వెళుతున్న
సైనికుల్లా...
చీమలు - సమైక్యతను
దృశ్యీకరిస్తున్నాయి !
తీరాలు దాటుకుంటూ
నదులు -
కడలిని చేరుతున్నాయి !
కలసిన ఆనంద కెరటమై
కడలి కేరింతలు కొడుతోంది !
తమ కాధారమై నిలిచిన
వేరు తల్లిని
ఏనాడూ వీడలేదు
కొమ్మలూ - రెమ్మలూ
తరతరాలుగా - చెట్టు
ఉమ్మడి కుటుంబానికి
ఆనవాలమై నిల్చుంది !
సమైక్య తోరణంలా
విడదీయరాని బంధం తమదని
గర్వంగా చెబుతున్నాయి గిరులు
సంపాదించిన ఆహారం
తోటివారితో పంచుకుని
కలిసి భుజించే సంస్కారం
ప్రదర్శిస్తున్నాయి కాకులు !
ఇవేమీ పట్టని మనిషికి
ఐక్యతే ఆనందమనే సందేశం
ప్రకృతి నిత్యం అందిస్తూనే ఉంది !
ఐన వాళ్ళ మధ్యే
అనాధగా బ్రతుకీడుస్తున్న
అమ్మ కన్నీరు
సునామీగా ఎగసిన రోజున
విడిపోయిన నాలుగెద్దుల్లా
ఒక్కొక్కరూ ఓడిన క్షణాన
అప్పుడు-
అప్పుడైనా -
రాతి గుండె ఏరై పారి
మమతల మోడు
చిగురించిక మానదు !
ప్రకృతి సందేశం
మనిషికి చేరకా తప్పదు !

---

మనస్సులో 'కోతి'ని గురించి అనుకోకూడదు-అని.

మామూలు మానవులకి అది యాడన్నా సాధ్యమవుతుందా?

అట్లే ఈరిగాడు గూడ దేన్ని మరిసిపోవల్ల అని అనుకొంటావుంటాడో దాన్నే మరిసిపోకుండ వుండాడు. అందుకే జతగాని ఇంటికి బయల్దేరేతవుడు కాళ్లకి సెప్పులు గుర్తొచ్చి, ఇంగొగు నేస్తగాని ఇంటికి పాయ.

ఈడు శానా జల్సారాయుడు. పూటకొగ రకమైన బట్టలు, దినానికికొగ రకమైన సెప్పులు మారుస్తావుంటాడు. వాన్నడిగి బాగుండే సెప్పులేసుకొని తయారయ్యిపాయ.



పుట్టిన్రోజు పండగ శానా జోరుగా జరుగుతావుంది. కండ్లు శబ్బర్లొచ్చే రకంగా మిటకరిచ్చి ఎలుగుతావుండే రకరకాల కరెంటు బుడ్డీలు, ముఖము కేసి రుద్దినట్ల ఎగుటనిపించే తీపి వంటలు- తొట్టితొలీగా అట్లా ఆర్భాటం సూసిన ఈరిగాడు మూతి మీద సేతులుంచుకొని, నోరు తెర్సుకొని సూసుకొంట అబ్బురపడిపాయ.

అందరితో పాటు, పుట్టిన్రోజు పండగ పబ్బితిలన్నీ ముగించి ఇంటికియల్బారె.

అంతసేపటికి నల్లగా, దుబ్బగా వుండే ఒక ఆసామి పారిపారి వొచ్చి ఈరిగాన్ని నిలేశ. "ఆ సెప్పులు కొని వారం దినాలయినా కాలేదు. నిన్న టెంకాయ కొట్టుకొస్తామని శనేశ్వర స్వామి గుడికిపోతే దొంగతనం అయ్యిండివి. కావల్లంటే రసీదుగూడా సూడండి" అని గలాటకి పెట్టుకొనె.

ముందే సెప్పుల్లేకుండ ఇదైపోతావుంటే ఈరిగాడు తబ్బిబ్బయి పాయ. తడకలాడుకొంట సెప్పిన మాటలు ఆడగుంపుగా సేరిన ఎవర్నీ నమ్మించంలేదు. అందరూ ఆదుబ్బాయప్పకే వత్తాసుపలికిరి.

ఇంగసేసేదేమీ లేక సెప్పులాడ ఇడ్సి ఉత్తకాళ్లీడ్సుకొని ఇంటిదావ ఒట్టే ఈరిగాడు. "దరిద్రవోడు తలకడుక్కొందామని తడిసేకిపోతే వడగండ్లవాన పడె" అనేది దీన్నే కావొచ్చు! పాపం !!

# కళింగాంధ్ర సామాజిక చరిత్ర

- దుప్పల రవికుమార్
✆ 7396997910



**ఈ "కథా పార్వతీపురం" సంకలనం మాత్రం మొత్తం కళింగాంధ్ర ప్రాంత సామాజిక చరిత్రకు డాక్యుమెంటుగా నిలిచే బృహత్తర ప్రయత్నం. ప్రముఖ కళింగాంధ్ర కథకులు అట్టాడ అప్పలనాయుడు, గంటేడ గౌరునాయుడు సంయుక్తంగా సంకలనపరిచిన ఈ 52 కథల నిండా పరుచుకున్న జీవితం గడిచిన ఐదారు దశాబ్దాల యదార్థ వ్యదార్థ గాథలకు అక్షరరూపం.**

పార్వతీపురం అనే ఊరు ఈ 450 పేజీల నిండా పరుచుకున్న 52 కథలకు ఇరుసే అయినప్పటికీ, ఈ "కథా పార్వతీపురం" సంకలనం మాత్రం మొత్తం కళింగాంధ్ర ప్రాంత సామాజిక చరిత్రకు డాక్యుమెంటుగా నిలిచే బృహత్తర ప్రయత్నం. ప్రముఖ కళింగాంధ్ర కథకులు అట్టాడ అప్పలనాయుడు, గంటేడ గౌరునాయుడు సంయుక్తంగా సంకలనపరిచిన ఈ 52 కథల నిండా పరుచుకున్న జీవితం గడిచిన ఐదారు దశాబ్దాల యదార్థ వ్యదార్థ గాథలకు అక్షరరూపం. స్వాతంత్ర్యం పొందిన తరువాత అభివృద్ధి పరమపద సోపానపటంలో పదే పదే పామునోట చిక్కి విలవిల్లాడుతుందెవరో, అదేపనిగా నిచ్చెనమెట్లనెక్కుతూ కళకళలాడుతున్నదెవరో తేల్చిచెప్పే ఈ కథలను అసాంతం చదవడమంటే కళింగాంధ్ర జీవితాన్ని కెలిడియోస్కోపులో పరిశీలించడమే. పేదలు నానాటికీ మరింత పేదరికానికి దిగజారుతుంటే, పెట్టుబడిదారులూ రాజకీయ నాయకులూ తరతరాలకూ తరగని ఆస్తులను సంపాదించడం వెనుక నడుస్తున్న చలన సూత్రాలను మనకు బోధపరిచే కథలివి.

తూరుపు కనుమల్లో మలమల మాడిపోతున్న జీవాల భగభగ మండుతున్న హృదయాలను తెలుగు నేలకంతటికీ పరిచయం చేసిన కథకుల కథకుడు భూషణం మేష్టారు సృజించిన "మట్టి" కథలో చెరువు గర్భంలోని మట్టి పట్టాగా మారిపోయిన వైనం దానిమీద ఆధారపడి కొన్ని తరాలుగా మట్టికుండలు చేసుకుని బతుకులీడుస్తున్న ఆ సామాజిక వర్గానికి తెలియకపోవడం విచిత్రం కాదు. కాని, తన ప్రజల కోసం అమాయకంగా తనను తాను త్యాగం చేసుకున్న ఆడబిడ్డ మట్టి తన తప్పు లేకుండానే మట్టిలో కలిసిపోతుంది. ఆవిడ త్యాగం వృథాగా పోతుంది. అప్పటికి తెలుగు కథా ప్రపంచానికి కొత్తదైన కథావాతావరణంలో భూషణం తన వెంట పాఠకుని లాక్కునిపోతారు. ఒకవైపు గ్రామ జీవితంలో ఓ వృత్తి నిపుణుల జీవితాలను మనకు పరిచయం చేయడంతో పాటు, మరోవైపు సమాజంలో అప్పుడే వస్తున్న కొత్త మార్పులకు అనుగుణంగా పాత వృత్తులు కొట్టుకుపోవడంతో అస్తవ్యస్తమైన జీవితాన్ని యథాతథంగా భూషణం ఈ కథలో చిత్రించారు. అక్కడికి కొన్ని దశాబ్దాలు గడిచిన తరువాత నూతన ఆర్థిక విధానాలు వాటి ఉధృతిలో అమలవుతున్న నేపథ్యంలో గ్రామాలు మరింతగా విచ్ఛిన్నమైనాక, పూర్తిగా బతుకుతెరువే కొరవడడంతో అన్ని స్థాయిల్లో ఏర్పడిన సంక్షోభాన్ని ఎంతో ప్రతిభావంతంగా చిత్రించడం ఉత్తరాంధ్ర కథకుల విశిష్టత.

జంగమ కులస్థుడైన రామలింగం రోజు రోజుకు చితికిపోతున్న తన ఆర్థిక పరిస్థితిని మరి గట్టెక్కించలేక పోతాడు. సినిమా పాటల్లో, టీవీ ఆటల్లో మైమరిచి మురిసిపోతున్న ఈ తరానికి – తన పాటవిని నాలుగు బియ్యం గింజలు వేసేంత తీరుబడి, పెద్ద హృదయం లేకపోతాయి. రోడ్డు వెడల్పులో తన పాక కూడా ఎగిరిపోయి నిలువనీడ లేకుండా అయిపోతాడు. అభివృద్ధి అందజేస్తున్న భూతల స్వర్గం పేద బతుకుల పాలిట భూతాల సొర్గంగా మారిపోవడం విషాదమని చింతా అప్పలనాయుడి "భూతాల సొర్గం" కథ మన గుండెల్ని పిండేస్తూ చెప్తుంది. చేసిన అప్పును తీర్చలేని దుస్థితిలో ఉన్న రామలింగం జీవనాధారాలైన గంట, కుట్టుమిషను ఊరివారు పట్టుకెళ్లిపోవడంతో పాలుపోనితనంలో తెగింపుగా ఏం చేయాలో అప్పటికింకా రామలింగానికే కాదు, ప్రజలకెవరికీ జీవితం నేర్పలేదు. కులవృత్తులు పోగొట్టుకుని కొత్త ఉపాధి వెతుక్కోవడం గ్రామీణ జీవితంలో అనివార్యమవుతున్న క్రమంలో పాలకొల్లు రామలింగస్వామి "కొత్త దృశ్యం" కథలో మేదర సామాజిక వర్గం బుట్టలు అల్లడం మానుకుని కోడి మాంసం అమ్ముకునే దుకాణాలు పెట్టుకుంటారు. ఆ చిన్న

☞

వ్యాపారం అనబడే జీవనోపాధికి సైతం కార్పొరేట్ చికెన్ షాపులొచ్చి గండి కొట్టడం ఆటవిక న్యాయమైన చిన్న చేపను పెద్ద చేప మింగడమనే దుర్నీతిని గుర్తుకు తెస్తుంది.

అయితే బతుకు తెరువు కానరాక, నిలువనీడ లేక, ఆదుకునే తోడులేక చావుతప్ప మరో మార్గంలేని ప్రజలకు ఆపన్నహస్తంలా ఆదుకున్నది పట్టణీకరణక్రమమే. ఎంతో వైరుధ్య పూరితమైన అంశమిది. ఆత్మహత్యలకు ఒడిగట్టకుండా అంతులేని ఆత్మవిశ్వాసంతో, కొండంత నిబ్బరంతో తరతరాలుగా చేస్తున్నదే అయిన వలసను కళింగాంధ్ర ప్రజలు ఆశ్రయించడం కేవలం సామాజిక శాస్త్రాన్ని అధ్యయనం చేసేవారు గమనిస్తారు. ఇక కాస్తో కూస్తో సాగు యోగ్యమైనదో, కానిదో భూమి ఉన్నవారు పడుతున్న వెతలకు కారణాలు అనేకం. ఒకవైపు సమయానికి వర్షాలు రాకపోవడం, పంట చేతికందే సమయానికి తుపానులు విలయతాండవం చేయడం, నాణ్యమైన విత్తనాలు దొరక్కపోవడం, ఎరువుల పంపిణీ సరిగా చేయకపోవడం, ఇలా అనేకానేక కారణాలతో వ్యవసాయానికి పెట్టుబడులు ఇతోధికంగా పెరిగిపోవడం, కష్టపడి సాధించుకున్న కొద్దిపాటి పంటకు సరైన ధరలు లభించకపోవడం రాను రాను రైతులను ఆర్థిక సంక్షోభంలోకి నెట్టేశాయి. ఈ వైనాన్ని దాదాపుగా కళింగాంధ్ర కథకులందరూ తమ కథల్లో, కవితల్లో అక్షరబద్ధం చేశారు. కథాపార్వతీపురం సంకలనంలో అలాంటి మెచ్చదగిన కొన్ని కథలను సంపాదకులు చేర్చారు. దాని ద్వారా ప్రజలందరికీ ఇక్కడి రైతుల వెతలను తెలియజెప్పారు. అప్పు చైతన్య తన "సావు బతుకు" కథలో తుపాను దాటికి పంట కొట్టుకెళ్లిపోయి దానికోసం చేసిన అప్పు మాత్రం సిమ్మాలుకు గుదిబండలా మిగిలిపోతుంది. అప్పు ఇచ్చిన వ్యాపారి భూమిని కొట్టేద్దామని చేసిన ప్రయత్నాన్ని అడ్డుకోవడానికి కూలిగా మారి సిమ్మాలు కలప అక్రమ రవాణాకు సిద్ధపడతాడు. అప్పు తీర్చేంత సొమ్ము చేతికందే చివరి ప్రయత్నంలో పోలీసులకు దొరికిపోతాడు. ఇంతలో బండికి కట్టిన ఎద్దు కూడా చనిపోతుంది. అకస్మాత్తుగా ఆగిపోయిన కథలో కష్టాల కడలిలో సిమ్మాలును ఒంటరిగా వదిలివేయలేక పాఠకుడు విలవిల్లాడిపోతాడు.

***

**అయితే బతుకు తెరువు కానరాక, నిలువనీడ లేక, ఆదుకునే తోడులేక చావుతప్ప మరో మార్గంలేని ప్రజలకు ఆపన్నహస్తంలా ఆదుకున్నది పట్టణీకరణక్రమమే. ఎంతో వైరుధ్య పూరితమైన అంశమిది. ఆత్మహత్యలకు ఒడిగట్టకుండా అంతులేని ఆత్మవిశ్వాసంతో, కొండంత నిబ్బరంతో తరతరాలుగా చేస్తున్నదే అయిన వలసను కళింగాంధ్ర ప్రజలు ఆశ్రయించడం కేవలం సామాజిక శాస్త్రాన్ని అధ్యయనం చేసేవారు గమనిస్తారు.**

***

జి.ఎస్.చలం రాసిన "అంకురం" కథలో రైతులపై దళారీ వర్గం పన్నుతున్న జలతారు వలల మాయాజాలాన్ని మరింత పకడ్బందీగా వర్ణించారు. రియల్ ఎస్టేటు దాహానికి పచ్చటి పంట భూములను అర్పించడానికి ఒక పద్ధతి ప్రకారం జరిగిన కుట్రలో ఇక్కడి గ్రామాధికారులు కమిషన్ కాసులకు కక్కుర్తి పడి సహకరించడం విషాద వాస్తవం. పంట భూములను రైతుల దగ్గర నుంచి గుంజుకోవడం కోసం జరిగే ప్రయత్నాలు అన్నీ ఇన్నీ కావు. ఆ వూరిలో అందరిలాగానే రామినాయుడు కూడా పొలం అమ్మడానికి సిద్ధపడిపోతాడు. అలా అనేకంటే మొత్తం రైతులందరినీ మానసికంగా సన్నద్ధం చేస్తారు. చివరి క్షణంలో రామినాయుడు తెలివి తెచ్చుకుని ఆగిపోతాడు. మరికొంతమంది రైతులు కూడా ఇదే ఆలోచనలో పడతారని కథకుడు ఆశావహదృక్పథం చూపిస్తాడు గాని, అది కేవలం ఆశ మాత్రమే. తేజో మూర్తుల ప్రకాశరావు రాసిన కథ "దేవుడి భూమి"లో కథానాయకుడు పేరు కూడా రామినాయుడే. తన కుటుంబమంతా భూమిని తెగనమ్మి వచ్చిన డబ్బుతో పట్నం పోయి కూలో నాలో చేసుకుందామని సిద్ధపడినవేళ, ఆ ఊరి పూజారి, దేవుడమ్మల సహకారంతో నాటకమాడి పొలం అమ్మకుండా గుడి పేర రాసేసి పట్నానికి పోతాడు. ముగింపు కాస్త నాటకీయంగా ఉన్నప్పటికీ పొలం దళారుల పాలుకాకుండా దేవుడి పేరునైనా ఉండడమనే రచయిత దృక్పథాన్ని పట్టిస్తుంది. పల్లా రోహిణీకుమార్ తన కథ "ఎరువు చింత"లో నిరక్షరాస్యురాలైన స్త్రీ తెగింపును చూపిస్తారు. ఎరువులను అక్రమంగా నిల్వ చేసి రైతులకు సమయానికి ఎరువు దొరక్కుండా నానాఇబ్బంది పెడుతున్న దొరబాబును చదువురాని గౌరమ్మ తెలివిగా పోలీసులకు పట్టించి ఆటకట్టిస్తుంది. ఆసుపత్రి పాలైన తన కొడుకును చూసి బెంగ పెట్టుకోకుండా సమస్య పరిష్కారాన్ని వెతుకుతుంది.

బి.వి.ఎ రామారావు నాయుడు రాసిన "ఎదిగొచ్చిన కొడుకు" కథలో పిల్లలను చదివించుకోలేని నిస్సహాయ స్థితిలో తన చిన్ననాటి స్నేహితుడు రాజారావు ఆదుకుని తన కొడుకు రామకృష్ణను చదివిస్తాడు. కానీ చదువు పూర్తయ్యాక ఉద్యోగం చేయడానికి ఇష్టపడక, తిరిగి తన గ్రామానికి వచ్చి చెయ్యాల్సిన పని కొంత ఉందని రామకృష్ణ వివరిస్తాడు. బక్కచిక్కిన బతుకులో సైతం కొడుకు తిరిగి వచ్చేస్తాడన్న నిర్ణయాన్ని తల్లిదండ్రులు స్వాగతించడం విశేషం. బహుశా పట్టణవాసపు తల్లిదండ్రులయితే రామకృష్ణను తిరిగి వెనక్కి పంపించేవారేమో. ఈ కథలో రామారావు నాయుడు పల్లెల్లోకి పరిశ్రమల రూపంలో విషం వచ్చి మొత్తం జీవితాలనే కాక, పంటనూ, నేలనూ నాశనం చేయనుందన్న హెచ్చరిక చేస్తారు. దీనికి పొడిగింపుగా పి. కమలకుమారి తన "భస్మ సింహాసనం" కథలో రసాయనిక పరిశ్రమల కోసం పచ్చటి భూములనే కాదు, మనిషి ప్రాణాలను సైతం ఏమాత్రం ఖాతరు లేకుండా చిదిమేస్తున్న వైనాన్ని చక్కటి టెక్నిక్‌తో రాశారు. కథకుడికి వచ్చిన కలలో వాస్తవాన్ని, వాస్తవంలో కలను సమ్మిళితం చేసి అట్టుడుకిపోతున్న కళింగాంధ్ర జీవితాన్ని దశాబ్దం కిందట అక్షరబద్ధం చేయడం విశేషం. నూతన ఆర్థిక విధానాల నేపథ్యంలో మన బతుకులను ముట్టడించి, పెను విధ్వంసానికి పాల్పడుతున్న మార్కెట్ శక్తుల గురించి అప్పలనాయుడు తన "షా" కథలో చెప్పారు. తమది కాని ప్రాంతంలో పెట్టుబడిదారులు సాగిస్తున్న

విలయ తాండవాన్ని, సృష్టిస్తున్న విధ్వంసాన్ని ఈ కథ వివరిస్తుంది. ఆ విధ్వంసం నుంచి తమను తాము ఎలా కాపాడుకోవాలో ఇక్కడి స్థానిక పెట్టుబడిదారులు తలలు బద్దలు కొట్టుకునేలా ఆలోచించడం కొసమెరుపు. తమ పంచె కిందకు నీళ్లు చేరినప్పుడే పరిస్థితి గురించి ఆలోచించడం తెలివితక్కువతనం. చాలా బలమైన నిర్మాణంతో సాగిన కథగా ఈ "షా" కథను పేర్కొనవచ్చు.

ఇటువంటి వ్యవసాయ కుటుంబ నేపథ్యంలో సాగే జీవితాల్లో కొందరు వ్యక్తులు తమ విశిష్ట మూర్తిమత్వాలతో ఎలా భాసిస్తారో, కొందరు తమ నీచత్వాన్ని ఎలా బయటపెట్టుకుంటారో మరికొన్ని కథలు వివరిస్తాయి. మనస్తత్వ చిత్రణకు పెద్దపీట వేసిన ఈ కథల్లో ఒకవైపు అతలాకుతలంగా ఉన్న గ్రామీణ జీవితాన్ని చిత్రిస్తూనే బ్రహ్మ పదార్థంలాంటి మనుషుల మనసులను అక్షరబద్ధం చేయాలనుకునే కొందరు రచయితల సీరియస్ ప్రయత్నాన్ని మనం గమనిస్తాం. ఈ కథా పార్వతీపురం సంకలనంలో అలాంటి కథలకు ముందువరసలో నిల్చునే కథగా వంగపండు ప్రసాదరావు రాసిన "గోగ్రహణం"ను చెప్పుకోవాలి. ఒకడు పాడయ్యి మరొకడు బతకడంలోనే ముడిపడిన తిరకాసును ఎలాంటి మర్మం లేకుండా ప్రశ్నించింది ఆర్థిక శాస్త్ర నిపుణులు కాదు, చదువు సంధ్యలు లేని పశువుల కాపర్లు. పంటను తినేశాయని పశువులను కట్టేసి, జుర్మానా విధిద్దామనుకుని ఆలోచించిన కొందరు పెద్దమనుషుల కొద్ది బుద్ధులను నిలేసి కడిగేస్తారు చిన్నారులు. వంగపండు చక్కటి నెరేషన్‌తో కథ నడిపించారు. కథ చివరి కొచ్చేవరకు పిల్లల ఆటలతోనే మన సమయం గడిచిపోతుంది. ఒకడు బాగుపడితే చూసి ఓర్వలేనితనంలో అసూయాద్వేషాలకు అమాయకత్వం, అజ్ఞానం తోడైతే ఆ ఊరే వల్లకాడవుతుందని సముద్రాల సత్యన్నారాయణ తన "ఊరు చేరని అప్పన్న" కథలో మనకు అర్థమయ్యేట్టు చెప్పారు.

స్త్రీకైనా పురుషుడికైనా నీతి ఒక్కటేనని చెప్పడం సులువే కాని, జీవితాలలో ఆచరించడం చాలా కష్టం. అందులోనూ జీవితం పెద్దగా చూడని, పెద్ద పెద్ద చదువులు చదువుకోని పల్లెటూరి స్త్రీలు ఈ విషయంలో ఏం చేస్తారో మనకు వి.వి.బి. రామారావు తన "దాన్నేటనక" కథలో చెప్పారు. స్త్రీ చైతన్యం ప్రస్ఫుటంగా కనిపించిన ఈకథలో తన భర్త తప్పు చేస్తున్నాడని తెలిసి ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా పుట్టింటికి చేరుకుంటుంది గయిరమ్మ. విషయం తెలుసుకున్న తల్లి అప్పాయమ్మ కూతురికి నచ్చజెప్పి అత్తారింటికి పంపించకుండా తానొక్కర్తే అక్కడికి వెళ్లి నిలదీసి అడుగుతుంది. తన కూతురుకు మారుమనువు చేయడానికి సిద్ధపడుతుంది. కాని, తన కాళ్లమీద తాను నిలబడతానని గయిరమ్మ తీసుకున్న నిర్ణయం చదువుకున్న ఈ కాలపు అమ్మాయిలకు కూడా పెద్ద పాఠం. వేద ప్రభాస్ రాసిన కథ "బరువు"లో తన కూతురు ఇష్టంగా అడిగిన రోలును ఇవ్వాలని తల్లి దేవుడమ్మ ఒంటరిగా బయల్దేరుతుంది. ఇక్కడ రోలు ఇవ్వడం కంటే మొత్తంగా సాగిన బస్సు ప్రయాణంలో మనుషుల మనస్తత్వాన్ని మనకు పరిచయం చేయడమే రచయిత లక్ష్యం. డాక్టర్ బి.ఎస్.ఎన్. మూర్తి కథ "దేశం తూలుతోంది"లో సైతం మద్యం అక్రమ వ్యాపారం సాగే తీరును వర్ణించినట్టు కనిపించినప్పటికీ అట్టడుగు మద్యం మాఫియాలో పీకలోతుగా కూరుకుపోయిన మనుషుల మనస్తత్వమే అసలు రచయిత చెప్పాలనుకున్నది. అంతుచిక్కని మనస్తత్వాన్ని అభివర్ణించడం రచయితలకు కూడాసాధ్యం కాదేమోనని రౌతు సురేంద్రబాబు కథ "మేక" నిరూపిస్తుంది. కొప్పరి ఫకీర్‌నాయుడు ఈ ప్రపంచాన్నే కాదు, తన జీవితాన్ని సైతం పట్టించుకోకుండా తన శ్రమను నిరంతరాయంగా దోచుకుంటున్న నాయుడికి ఊడిగం చేస్తుంటాడు. ఎందుకో ఆ ఊరి ప్రజలకి అర్థం కాదు. నిజానికి పాఠకులకు కూడా. యువ కథకుడు మల్లిపురం జగదీశ్ తన "బాకుడుంబారి" కథలో కొండను స్వాధీన పరుచుకోవడానికి పెట్టుబడిదారుడు పన్నే కుయుక్తులను వివరిస్తాడు. గిరిజన ప్రాంతంలో రకరకాల సాకులను చూపి కొండలమీద జనావాసాలను ప్రభుత్వం ఖాళీ చేయిస్తుంటుంది. ఎందుకంటే కొన్నేళ్ళ తర్వాత ఆ కొండలను దిగమింగడానికి, కొండపై లభించే సహజవనరులను గుత్త సొత్తుగా దోచుకోవడానికి. దానికి మూల్యంగా ఆ జనావాసాలు గూటికో పిట్టగా చెల్లాచెదురైపోతారు. అనాథలవుతారు. వారి గోడు ఈ భూప్రపంచం మీద ఎవ్వరికీ పట్టదు.

పోలీస్‌స్టేషన్‌లో అత్యాచారానికి గురైన సుజాత ఆ మానసిక, శారీరక క్షోభ నుంచి బయటపడినప్పటికీ ఈ సమాజం అడుగడుగునా దాడి చేస్తుంటుంది. ఈ "సుజాత" కథలో వాడ్రేవు చినవీరభద్రుడు మనకు మనమే ఏర్పరుచుకున్న విలువలను, కట్టుబాట్లను సూటిగా ప్రశ్నిస్తారు. తరాలు మారుతున్నప్పటికీ, ఆధునికమై పోతున్నామని మనం భ్రమిస్తున్నప్పటికీ అది కేవలం అపోహగానే మిగిలిపోతున్నట్టు ఈ కథలో సుజాత మనముందు మౌనంగా రోదిస్తుంది. ఇలాంటి ఆణిముత్యాలైన 52 కథలతో కథాపాఠకులకు కళింగాంధ్ర సామాజిక చరిత్రకు డాక్యుమెంటుగా సహకరించే ఈ "కథా పార్వతీపురం" చదవడం గొప్ప అనుభూతి. చరిత్రను, చారిత్రక ఘటనలను సాహిత్య రూపంలోకి అనువదించడం చాలా కష్టమైన పని. అందుకు ఆ చరిత్రలో దగ్గరి సంబంధం, ఆ చరిత్ర సారంపట్ల అవగాహన, ఆ గత చరిత్రకు వర్తమానంతో ఉన్న సంబంధం రచయితలకు తెలిసిఉండాలి. అప్పుడే ఆ సాహిత్యం అక్కడి ప్రజలకు తన గతపు గుట్టు విప్పగలుగుతుంది. అప్పుడే ఆ సాహిత్యం వర్తమానాన్ని విశ్లేషించగలుగుతుంది. అప్పుడే ఆ సాహిత్యం భవిష్యత్తు దిశా నిర్దేశం చేయగలుగుతుంది. కథా పార్వతీపురం సరిగా విజయం సాధించింది ఇక్కడే.

***

**52 కథలతో కథాపాఠకులకు కళింగాంధ్ర సామాజిక చరిత్రకు డాక్యుమెంటుగా సహకరించే ఈ "కథా పార్వతీపురం" చదవడం గొప్ప అనుభూతి. చరిత్రను, చారిత్రక ఘటనలను సాహిత్య రూపంలోకి అనువదించడం చాలా కష్టమైన పని. అందుకు ఆ చరిత్రలో దగ్గరి సంబంధం, ఆ చరిత్ర సారంపట్ల అవగాహన, ఆ గత చరిత్రకు వర్తమానంతో ఉన్న సంబంధం రచయితలకు తెలిసిఉండాలి. అప్పుడే ఆ సాహిత్యం అక్కడి ప్రజలకు తన గతపు గుట్టు విప్పగలుగుతుంది.**

***

# పునరుజ్జీవన రహదారి

బి. కళాగోపాల్
✆ : 944163028



ఓ భిక్షుకి లాలిపాట తడిమే
ఆర్ద్ర జ్ఞాపకాలనెన్నింటినో,
గాలి ఆగి ఆగి మోసుకువస్తున్నది
రహదారిలో నేను ...
కలల కుంచెలోని కొన్ని ఆలోచనలను
ఒలికించుకొంటూ రాలిన ఆకుల
అడుగులలో అదృశ్యమవుతాను
క్రొత్త ఉదయాలను ఒంటికి పట్టించుకొన్న
జనాలతో, ఫుట్‌పాత్
రంగస్థల వేదికగా ముస్తాబవుతున్నది
పట్నం రంగు అద్దుకొన్న పల్లెలా,
చుట్టూ బిగిసిన నాగరికత ఉక్కు మేడల
క్రింద చితికిన చిల్లర బ్రతుకుల్లో..
రాత్రి రెక్కల నీడన పరుచుకొన్న
ఆకలి సామ్రాజ్యపు కేకలు
ఆరు ఋతువులు చిమ్మిన రంగుల కాన్వాస్‌పై
అమూర్త చిత్రాల్లా.. దైన్యపు ముఖాలు !
రాజీ కామాలతో బ్రతుకుబండిని,
చీకటి సొరంగాల్లోకి పరకాయ ప్రవేశంచేసే,
నిర్భాగ్యుల కళ్ళలో.. తడమలేని చిద్రాలెన్నో !!
పూరెక్కల చిన్నిచేతిలో
నవ్వుతున్న గాంధీనాణెం.. జవాబుచెప్పదు
గమనాన్ని, గమ్యాన్ని ఏకంచేసే
అనంత ప్రహేళికలా, ఫుట్‌పాత్..
తన ఎండమావుల గొడుగులతో,
నిరీక్షణల దోసిలిని నింపుతూనే ఉంది
నిప్పుల పిడికిలి బిగించిన లాంగ్ మార్చ్‌లా,
అదెప్పుడూ చరిత్రను ప్రశ్నిస్తూనే ఉంది
ముగింపులేని మరో ఆరంభంలా, ఫుట్‌పాత్
సమస్త మానవాళిని అక్కున చేర్చుకొనే,
మరో సమాజపు పునరుజ్జీవన రహదారి

---

# విధ్వంస రచన

- మంత్రి లక్ష్మీనారాయణ
✆ : 9848676264



ఆ చెట్లే వారికి కామధేనువులు
ఆ చెట్టే వాళ్ళకు కల్పవృక్షాలు
ఈత - తాటి చెట్టే వారికి జీవనాధారం
అవే కదా ! గీత కార్మికుల జీవధార
మద్యం మాఫియా మాయాజాలం
బడా వ్యాపారుల స్వార్థ కరవాలం
చెట్లను పడగొట్టి బడుగుల్ని మెడపట్టె
అడ్డాకూలీలుగా మార్చే కుటిల వ్యూహాలు !
వేదన ఒకరిది వేడుక మరొకరిది
విలవిల లాడేది ఒకడు వినోదించేది మరొకడు!

మూలుగుతున్న కులకశ్పి నడం మీద తాటి పండు
ఈతనార చీల్చి తట్టలల్లినట్లు
కుల వృత్తులను చీల్చి మట్టుపెట్టే మకిలి ప్రయత్నాలు
రాక్షసి పొగ కమ్మేసినట్లు కులకశ్పిని నిర్వీర్యం చేసే
వికృత వాతావరణం !

కల్లుగీత కార్మికులలో కమ్ముకుంటున్న అశాంతి
మానేరు వాగులా బతుకు ఎండిపోతుంది
కలలు కన్న ఇల్లు అమ్ముకుంటారు
కలిసివున్న ఊరు విడిచిపెడతారు
పొగచూరి పోతున్న ఆశలతో...
నెత్తిన చేతులు పెట్టుకుంటున్న కులకశ్పి !
ప్రాణాలు లాంటి వృత్తుల్ని చావగొట్టే
చెవులు మూసే కుయుక్తులు !

ఆశలు, ప్రలోభాలు పసిపిల్లల్ని ఊరించే
అరచేతిలో స్వర్గమే చూపించే నేతల వాగ్దానాలు !
ఏకు మేకయిన ముచ్చటయినా...
ఏకతాటిపై నిలిచి ధిక్కరిస్తే
విధ్వంస రచన వీగిపోక తప్పదుగా !

# తెలుగు మహాసభల సందర్భంగా భాషా వికాసానికి సమగ్ర చర్యలు చేపట్టాలి

**తి**రుపతిలో డిసెంబరు 27, 28, 29 తేదీలలో నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభలు తలపెట్టిన ప్రభుత్వం వాటి నిర్వహణకు సంబంధించి గాని, తెలుగు పరిరక్షణకు సంబంధించి గాని సమగ్ర విధానం ప్రకటించకపోవడం విచారకరం. రాజకీయాల పట్ల భిన్నాభిప్రాయాలున్నా తెలుగు భాషను అభివృద్ధి చేసుకోవడం పట్ల భిన్నాభిప్రాయాలకు ఆస్కారం లేదు. కుల మత ప్రాంతాలకు అతీతంగా తెలుగు వారంతా కోరుకునే భాషా వికాసం విషయంలో ప్రభుత్వం విశాల చర్చ జరిపి అందరినీ భాగస్వాములను చేసుకుని వుండాల్సింది. ఆ విధమైన ముందు చూపుతో ప్రణాళికా బద్ధంగా వ్యవహరించకపోవడం వల్లనే సభలను వారం రోజుల వ్యవధి కూడా లేకపోయినా ఇప్పటికీ మహాసభ లక్ష్యాలు, ఆహ్వానాలు అన్నిటిపైనా అస్పష్టత నెలకొని వుంది. అధికారులు, భాషాభిమానులు సాహిత్యకారులు, పాత్రికేయులు కూడా సభలకు సంబంధించిన అంశాలపై గందరగోళంలో వున్నారు. మీడియాలో దీనిపై అనేక విమర్శలు, వ్యాఖ్యలు వస్తున్నా స్పందన కరువవుతున్నది.

గతంలో అనేక ఉత్తర్వులున్నా, నిధులు మంజూరైనా తెలుగును అధికార భాషగా మార్చుకోవడంలో విఫలంకావడానికి కారణాలేమిటి? అకాడమీలు, యూనివర్శిటీలు, అధికార భాషా సంఘాలు, వ్యవస్థలు ఎందుకు విఫలమైనాయి? ప్రాచీన లేదా విశిష్ట భాషా హోదా సంబరాలు, నిధులు ఏమైనాయి? ఇలాటి ప్రశ్నలు వేసుకోకుండా మరో వేడుక జరుపుకోవడమే గొప్ప అనుకోవడం అర్థరహితం. పాలనా భాషగానూ బోధనా భాషగానూ, శాసన భాషగానూ, దైనందిన జీవిత వ్యవహారాలలోనూ తెలుగు అమలు లోకి రాకపోవడానికి కారణాలను గుర్తించి చక్కదిద్దే చర్యలు తక్షణం చేపట్టవలసి వుంటుంది. కొంతమంది చెబుతున్నట్టు కేవలం తమిళనాడులో అనుసరిస్తున్న పద్ధతులు, మరికొందరి పునరుద్ధరణ ధోరణులు గాక తెలుగు నాట గురజాడ, గిడుగు వంటి వారు వందేళ్ళ కిందటే సాగించిన వాడుక భాషా ఉద్యమ వరవడి మార్గదర్శకంగా ఉంటుంది. నేటి ప్రపంచీకరణ నేపథ్యంలో సరికొత్త సాంస్కృతిక పునర్వికాసం అవసరం అవుతున్నది.

కనుకనే ఈ సందర్భంలో మహాసభల నిర్వహణపై పారదర్శకంగా ప్రజాస్వామికంగా వ్యవహరించడంతో పాటు దీర్ఘకాలంలో తెలుగు భాషా వికాసానికి నిర్దిష్టమైన చర్యలు నిర్మాణాత్మక శాసనాలు రూపొందించాలని సాహితీస్రవంతి కోరుతున్నది.

1. అధికార భాష అమలుకు సంబంధించిన ఉత్తర్వులను తక్షణం అమలుచేయాలి. వాటిని పాటించని అధికారులపై ఖచ్చితమైన చర్యలుండాలి. నిర్లక్ష్యంగా వ్యవహరిస్తే కఠిన చర్యలు చేపట్టాలి.
2. మాధ్యమిక స్థాయి వరకూ తెలుగు తప్పని సరిగా బోధించాలి. తెలుగు మాతృభాషగా గల విద్యార్థులు తెలుగు చదవకుండానే ఉన్నత విద్య పూర్తిచేసే అవకాశం వుండరాదు.
3. తగు ప్రాతిపదిక లేకుండానే బలవంతంగా ఇంగ్లీషు మాధ్యమం ప్రవేశపెట్టాలన్న వొత్తిడిని మానుకోవాలి.
4. తెలుగు మాట్లాడినందుకు శిక్షలు విధించే వారిపట్ల కఠినంగా వ్యవహరించాలి. వారి ధోరణిని నిరసిస్తూ విస్తృతంగా ప్రచారం చేయాలి.
5. తెలుగు భాషలోని ఉత్తమ సాహిత్య సంపదను అందుబాటులోకి తెచ్చేందుకు ప్రణాళిక రూపొందించాలి. మార్గదర్శకులు, వైతాళికుల రచనలను తక్కువ ధరకు అందుబాటులోకి తీసుకొచ్చి ఆదరణ కల్పించాలి. ప్రాచీన సాహిత్యాన్ని, జానపద సంపదను సత్వరం ప్రచురించి భద్రపరచాలి.
6. ఉత్తమ గ్రంథాలను ఇతర భాషలలోనుంచి తెలుగులోకి అనువదించడాన్ని ప్రోత్సహించాలి. విస్తరిస్తున్న విజ్ఞానం ఎప్పటికప్పుడు తెలుగులోకి తీసుకురావడానికి ప్రభుత్వం ప్రాధాన్యత నివ్వాలి.
7. తెలుగు ఫాంట్లు, ఇంటర్నెట్‌లో తెలుగు వినియోగం విస్తరించేందుకు దోహదం చేయాలి. ఈ దిశగా ఔత్సాహికులు చేస్తున్న కృషికి చేయూతనివ్వాలి.
8. ప్రామాణిక తెలుగు పాఠ్యగ్రంథాలను రూపొందించి మాతృభాషలో విద్యార్జనను ప్రోత్సహించాలి.
9. ప్రభుత్వ ఉత్తర్వులు, ప్రకటనలు తప్పని సరిగా తెలుగులో విడుదల చేయాలి. ప్రభుత్వ వ్యవహారాలలో అనవసరమైన ఇంగ్లీషు వాడకాన్ని నిరుత్సాహపర్చాలి.
10. ప్రాచ్య తెలుగు భాషా పండితులకు రక్షణ కల్పించాలి. తెలుగుపై పరిశోధనలను, అధ్యయనాలను ప్రత్యేకంగా ప్రోత్సహించాలి.
11. ప్రాచీన భాషకు సంబంధించిన నిధుల వినియోగం, యంత్రాంగంపై శ్వేతపత్రం ప్రకటించాలి.
12. రాష్ట్రం వెలుపల వున్న తెలుగువారికి భాషా సాహిత్య పరమైన సహాయ సహకారాలు అందించాలి.
13. తెలుగు భాషను ఆధునికంగా సుసంపన్నంగా తీర్చిదిద్దడానికి నిరంతర ప్రాతిపదికపై యంత్రాంగం ఏర్పాటుచేసి పారదర్శకంగా పనిచేయించాలి. ప్రజల భాగస్వామ్యం వుండేలా చర్యలు తీసుకోవాలి.
14. తెలుగులో కోర్టు తీర్పులు ఇవ్వడంతో సహా న్యాయవ్యవస్థలోనూ తెలుగును అధికంగా ప్రవేశపెట్టాలి.
15. పోలీసు స్టేషన్లలో ఎఫ్ఐఆర్‌లు, ఆస్పత్రులు తదితర చోట్ల వ్యవహారాలు తెలుగులోనే పూర్తిగా నిర్వహించి జన బాహుళ్యానికి సులభంగా వుండేలా చూడాలి.
16. బోర్డులపై తప్పక తెలుగు అక్షరాలు వుండేలా చూడాలి.

**– తెలకపల్లి రవి, అధ్యక్షులు**

**సాహితీస్రవంతి**

**21.12.2012**

# రచయిత - రాజ్యం గురజాడ 'మనిషి'



రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
9440222117

*మనిషి చేసిన రాయిరప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయి రప్పల
కన్న కనిష్టం
గాను చూస్తావేల బేలా ?
దేవుడెకడో దాగెనంటూ
కొండకోనల వెతుకులాడే
వేలా ?
కన్నుతెరిచిన కానబడదో
మనిషి మాత్రుడియందు లేడో
యెరిగికోరిన కరిగియీడో
ముక్తి*

గురజాడ అప్పారావు తన యాభయ్యవ ఏట (1912) ఈ కవిత రాశాడు. ఈ కవిత వచ్చి నూరేళ్ళయింది. ఈ కవితకు 2012 శత జయంతి సంవత్సరం. గురజాడ కలగన్న కొత్త 'మనిషి' ఈ కవిత. ఆధునిక మానవుణ్ణి ఈ కవితలో ప్రతిపాదించాడు గురజాడ. మనిషిని నమ్మే మానవుణ్ణి కలగన్నాడు గురజాడ. దేశమంటే మనుషులేనని చెప్పిన గురజాడ మనిషికి నమ్మకం ఉండ వలసింది మనిషి మీదననీ చాటారు ఈ కవితలో. మతాలన్నీ నశించిపోయి జ్ఞానం మాత్రం మిగులుతుందని, అప్పుడు భూమి స్వర్గంగా మారుతుందని భావించిన గురజాడ మనిషి దృష్టిని మనిషి వైపు మరల్చడానికి 'మనిషి' కవిత రాశాడు.

మనిషి జీవితం చుట్టూ ఉండే మనుషులచే నిర్ణయింపబుతుందని, మానవ సమస్యలకు పరిష్కారం మనుషుల దగ్గరే ఉందని చెప్పడం కవి ఉద్దేశం. గురజాడ లక్ష్యం ఒక లౌకిక (సెక్యులర్) సమాజ నిర్మాణం.

ప్రాచీన సమాజం మనిషిని దేవుని చేతిలో, మతం చేతిలో, విధి చేతిలో బందీని చేసింది. అజ్ఞానంతో కూడిన భయంలోంచి పుట్టిన దైవ భావనకు రాజ్యం అండతో ఏర్పడిన పురోహిత వర్గం వ్యవస్థారూపం కల్పించింది. అప్పుడే దళారి వ్యవస్థకు పునాదులు పడ్డాయి. గుళ్ళు, విగ్రహాలు తయారయ్యాయి. మనిషి తన సృష్టికి తానే బానిసయ్యాడు. దైవభావనకు పూజారితోడు కావడంతో మతం మనిషి మీద పెత్తనం చేయడం ప్రారంభించింది. అల్ప సంఖ్యాకులైన పూజారి సమూహం అత్యధిక సంఖ్యకులైన శ్రామిక ప్రజలను తమ గుప్పిట్లో పెట్టుకోడానికి రకరకాల ప్రయత్నాలు చేశారు. వాఙ్మయం సృష్టించారు. ఫ్యూడల్, బానిసభావాలను ప్రచారం చేశారు. శ్రామిక జనం మీద తిరుగులేని ఆధిపత్యం సంపాదించారు. ప్రజల మీదనే గాక రాజ్యం మీద కూడా పూజారి వర్గం పట్టు సాధించింది.

ప్రాచీన కాలంలోనే మన దేశంలో మత వ్యవస్థకు భిన్నమైన ఆలోచనలు జరిగాయి. మనిషిని మనిషిగా గుర్తించే ఒక ప్రజాస్వామిక ఆలోచనను ప్రతిపాదించిన బౌద్ధం పుట్టింది మనదేశంలోనే. బౌద్ధం ప్రపంచానికి భారతదేశం ఇచ్చిన మహత్తరమైన ప్రజాస్వామిక కానుక. దానిని దేశం నుంచి వెళ్ళ గొట్టడంలో విజయం సాధించింది పూజారి వర్గం. ఇదొక మతపరమైన ఆత్మహత్య అని వర్ణించాడు గురజాడ.

ఆధునిక వైజ్ఞానిక శాస్త్రాలు అందుబాటులోకి వచ్చిన తర్వాత భౌతిక భావజాల వ్యాప్తికి అవకాశాలు పెరిగాయి. అవి ప్రకృతిని గురించి, ప్రపంచాన్ని గురించి కొత్త కొత్త విషయాలను బయటపెట్టాయి. మనిషికి మించిన శక్తి పట్ల అనుమానాలు కలిగించాయి. ప్రకృతి పరిణామాలు అర్థం కావడం విస్తృతమౌతున్న కొలదీ ఆధునిక జ్ఞానం విస్తృతంకాజొచ్చింది. ఈ జ్ఞానం లోంచే గురజాడ 'మనిషి' కవిత రాశాడు.

అయితే నూరేళ్ళ తర్వాత వెనక్కి తిరిగి చూసుకుంటే రెండు విరుద్ధ స్రవంతులు మనకు కనిపిస్తాయి. 1. గత నూరేళ్ళలో మనిషి వైజ్ఞానికంగా

సాధించిన విజయాలు. 2. దీనికి భిన్నమైన మత వ్యవస్థల విజృంభణ.

పారిశ్రామికంగా, వైజ్ఞానికంగా, విద్యాపరంగా వ్యవసాయ పరంగా ఇంకా అనేక రకాలుగా ఊహించని విజయాలు సాధించాం "ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయ్" అనే దశ నుంచి హరిత విప్లవం దాకా, శ్వేత విప్లవం దాకా ఎదిగాం. ఆహార సమస్య సమూలంగా పరిష్కారం కాకపోయినా, నూరేళ్ళ క్రితం ఉన్నట్లు ఇవాళ లేదు. విద్యా ఉద్యోగ రంగాలలోకి అడుగు పెట్టే అవకాశమే లేని సామాజిక వర్గాలు ఇవాళ హాయిగా ఆ రంగాలలోకి ప్రవేశించగలుగుతున్నాయి. ప్రకృతి వనరులను అపారంగా వినియోగం లోకి తెచ్చుకోగలుగుతున్నాం. మనిషి ఎక్కువ కాలం ఎక్కువ శ్రమతో చేసే పనిని యంత్రంతో అతి తక్కువ కాలంలో చేయించుకోగలుగుతున్నాం. మనిషి ఆర్థిక సాంఘిక బానిసత్వం నుండి పాక్షికంగా నైనా విముక్తి పొందగలుగుతున్నాడు. ఇదంతా 'మనిషి' వల్లనే సాధ్యమైంది. మనిషి చైతన్యంతో ఉద్యమ స్వభావంతో సాధించిందే ఈ విజయమంతా. సముద్ర ఆకాశ, గ్రహాంతర యానాలు వంటివి మనిషి చేసిన సాహసాలు.

**మనిషికి ముక్తి అంటే సమస్యల పరిష్కారమనే అర్థం. అది మనిషి చేతిలోనే ఉంది. మతం చేతిలో లేదు. అని చెప్పిన గురజాడ మాటను నూరేళ్ళ తర్వాత నైనా రాజ్యం పట్టించుకోవాలి. అన్ని రంగాలలోంచి మతం ప్రమేయాన్ని తప్పించాలి. నాయకులు మతంతో సంబంధం తెంచుకోవాలి. ప్రజలకు ఆదర్శప్రాయంగా నిలబడాలి. ప్రభుత్వ కార్యకలాపాలలో మతం పాత్రను నిర్మూలించాలి. మనుషులు ఎన్నుకునే నాయకులు మనిషి చెక్కిన విగ్రహాలను గౌరవించి మనిషిని అవమానించే పనిని ఆపాలి.**

అదే సమయంలో మానవేతర శక్తుల విస్తరణ కూడా జరుగుతూనే ఉంది. మనిషి సాధించిన భౌతిక విజయాలకు విరుద్ధంగా మతం తన శక్తిని పెంచుకుంది. ఆధునిక సామాజిక వ్యవస్థలో కూడా పురోహిత దళారివర్గం తన ప్రాబల్యాన్ని బాగా పెంచుకుంది. దీనికి రాజ్యం అండ వుంది. వైజ్ఞానికంగా సాధిస్తున్న విజయాల ప్రభావం మనిషి తాత్విక చింతన మీద పడకుండా తప్పించుకోవడంలో మత శక్తులు విజయం సాధిస్తున్నాయి. వలస పాలనలోనూ, స్వతంత్ర పాలనలోనూ ఇది వీలయింది. రాజ్యం అండ లేకుండా ఇది సాధ్యం కాలేదు.

మనుషులను మనుషులే నాయకులుగా ఎన్నుకుంటున్నారు, మనుషులే నాయకులను దించుతున్నారు. అయినా అధికారం చేపట్టడానికి, అధికారంలోకి రావడానికి నాయకులకు ప్రజలే ప్రధాన శక్తి అని తెలిసి కూడా మతాన్ని పురోహిత వర్గాన్ని ఆశ్రయిస్తున్నారు. అత్యున్నత పదవులలో, అత్యున్నత ఉద్యోగాలలో ఉంటూ విగ్రహాల చుట్టూ తిరుగుతున్నారు. బాబాలు అమ్మలు, స్వాముల ముందు మోకరిల్లుతున్నారు. అలా నాయకులు ప్రజల్ని మౌఢ్యం వైపు నెట్టుతున్నారు. మత సంస్థలు ఆశ్రమాలు ఎంత అవినీతి కూపాలుగా తయారయ్యాయో ఇటీవల అనేక సందర్భాలలో బహిర్గతమైంది. భక్తి కన్న సంపద అందులో ప్రధాన పాత్ర కావడం తెలుస్తూనే వుంది. రాజ్యం ఆ చీకటి సామ్రాజ్యాలకు అనేక సౌకర్యాలు కల్పించి వాటి ఆధ్యాత్మిక స్వభావానికి టూరిస్టు స్వభావం కల్పిస్తున్నది. ఇదంతా ఎందుకు అంటే మన రాజ్యానికి నిజమైన లౌకికతత్వం లేకపోవడమే. రాజ్యాంగంలో 'లౌకిక' శబ్దాన్ని రాసుకోవడమే తప్ప ఆచరణలో అది 'లౌక్యం'గా ఉంటున్నది. లౌకికవాదానికి మత వాదానికి వివాదం ఏర్పడినప్పుడు రాజ్యం మతం వైపు నిలుస్తున్నది. రాజ్యంలో మతానికున్నంత ప్రాముఖ్యం లౌకికతత్వానికి లేదు. మతాలకు మంత్రిత్వ శాఖలున్నాయి గానీ, లౌకిక వాదానికి అవిలేవు. శాస్త్ర సాంకేతిక రంగాలకు మంత్రులున్నారు గాని వాళ్ళు లౌకిక వాదులు కారు. సైంటిస్టులు సైన్సు చదువుకున్న వాళ్ళుగా ఉంటున్నారే తప్ప శాస్త్రీయ దృక్పథం కలిగిన వాళ్ళుగా ఉండటం లేదు. వాళ్ళ చదువు కుల మతతత్వాల నుండి, ఆ విశ్వాసాల నుండి వాళ్ళను దూరం చేయడంలేదు. ఉపగ్రహాలను కక్ష్యలోకి ప్రయోగించే ముందు, వెనుక అకేంద్ర బాధ్యులు గుడులకు వెళ్ళి మొక్కుకొని, మొక్కులు తీర్చుకొని వస్తున్నారంటే దానిని రాజ్యం ఆమోదిస్తున్నది. పాలకులే ముహూర్తాలు చూసి అధికారం చేపడుతున్నారు. ముహూర్తాలు చూసి యాత్రలు చేస్తున్నారు. మాటలు మనిషి గురించి, చిత్తం, విశ్వాసం విగ్రహాల మీద. ఇదే రాజ్యం. ప్రవృత్తి మనిషికి న్యాయం చెయ్యని, మనిషి అవసరాలు తీర్చని ఏ నాయకుడినీ మనిషి శిక్షించకమానడం లేదు. రాజ్య నిర్మాత మనిషే. ఏ మానవేతర శక్తి రాజ్యాన్ని నిర్మించడం లేదు. కాపాడడంలేదూ 'మానవుడు మహనీయుడు' రాజ్యం దీనిని అర్థం చేసుకొని, జీర్ణించుకొని అసలైన లౌకికతత్వాన్ని పొందవలసి ఉంది.

మనిషికి ముక్తి అంటే సమస్యల పరిష్కారమనే అర్థం. అది మనిషి చేతిలోనే ఉంది. మతం చేతిలో లేదు. అని చెప్పిన గురజాడ మాటను నూరేళ్ళ తర్వాత నైనా రాజ్యం పట్టించుకోవాలి. అన్ని రంగాలలోంచి మతం ప్రమేయాన్ని తప్పించాలి. నాయకులు మతంతో సంబంధం తెంచుకోవాలి. ప్రజలకు ఆదర్శప్రాయంగా నిలబడాలి. ప్రభుత్వ కార్యకలాపాలలో మతం పాత్రను నిర్మూలించాలి. మనుషులు ఎన్నుకునే నాయకులు మనిషి చెక్కిన విగ్రహాలను గౌరవించి మనిషిని అవమానించే పనిని ఆపాలి. విద్యా వ్యవస్థలోనే కాదు ఏ రంగాలలోనూ మతం పాత్రను కాపాడకూడదు. అప్పుడే ప్రజాస్వామ్యం పరిఢవిల్లినట్లు, పాఠ్య ప్రణాళికల నుండి, బోధన నుండి ప్రచార ప్రసార సాధనాల నుండి, ప్రభుత్వ నిర్వహణ నుండి మానవేతర అంశాలను రాజ్యం తప్పించి రాజ్యం మానవ రాజ్యంగా నిలబడాలి.

మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలచి వెలుగును
అంత స్వర్గ సుఖంబులన్నవి
అవని విలసిల్లున్. *(ముత్యాలసరములు)*

**('మనిషి' కవిత శతజయంతి సందర్భంగా)**



## చీకటి నిజం

- గవర ఈశ్వరరావు

✆ : 8897793399



చుట్టూరా చీకటి...
దట్టమైన చీకటి...
అవని గుండెల నిండా
భరించలేని చీకటి...
 చెట్టును పట్టుకుని
 వేలాడుతున్న గబ్బిలంలా...
కత్తుల్లా చీకటిని చీలుస్తూ
వర్షపు చినుకులు...
చీకటిని ఛిద్రం చేస్తూ
పెళపెళమని మెరుపులు...
నిశ్శబ్దాన్ని భేదిస్తూ
ఉరుముల అరుపు...
 అయినా
 చీకటి చెదరటం లేదు
హోరువాన... జోరు గాలి...
సునామీ ప్రళయం...
చీకటి తడిసి ముద్దవుతుంది
 అయినా...
 దరిద్రపుగొట్టు చీకటి
 కొట్టుకుపోవటం లేదు
 పాతాళంలోనికి వేళ్ళూనుకున్నట్టుగా...
మహా వృక్షాలు
నేలకొరుగుతున్నాయి
ఆకాశహర్మ్యాలు
కూలుతున్నాయి
ప్రాణాలు లేచిపోతున్నాయి
పాపాలు కడిగిపోతున్నాయి
 అయినా...
 చీకటి కదలటం లేదు
 ఎవరో వేనవేల హస్తాలతో
 అదిమి పట్టుకున్నట్టుగా...
ఒక్కసారిగా
వర్షం ఆగిపోయింది
 కళ్ళు చిట్లించినా...
 ఏమీ కానరావటం లేదు
 కటిక చీకటి
 చెవులు రిక్కించినా..
 ఏమీ వినబడటం లేదు
 అంతటా నిశ్శబ్దం
నిశ్శబ్దం... చీకటీ... భయం
ఒక తల్లి పిల్లలేమో...
 ఎట్టకేలకు తెల్లవారింది
 వెలుగు రేఖలు విచ్చుకున్నాయి
 ఎక్కడా చీకటి జాడ తెలీటం లేదు
 అంతటా ప్రశాంతత... చుట్టూరా
స్వచ్ఛత...
 పాపాలు కడిగిపోయినట్టున్నాయి
అదేమిటో చిత్రం
ప్రళయం ముందర...
విధ్వంసం తర్వాత కూడా...
ప్రశాంతతే...
 అయితే... ఈ చీకటి
 ఒక నిజాన్ని మాత్రం
 వెల్లడిస్తూ వెళ్ళిపోయింది...
 ప్రపంచాన్ని హెచ్చరిస్తూ
-దిక్కులు పిక్కటిల్లే శబ్దానికి...
కర్ణభేరి పగిలిపోయిన ఫర్లేదు
కానీ...
-వీసమెత్తు మౌనాన్ని మాత్రం ...
భరించడం కష్టం

## పాలిష్‌వాలా

హిందీ మూలం : నాసిర్ అహ్మద్ సిజిందర్

తెలుగు నేత : పిరిశెట్టి శ్రీనివాసరావు

✆ : 09989242343

వాడింకా పిల్లాడే
నా బూట్లను ఎవడైతే పాలిష్
చేస్తూ ఉండేవాడో
నల్లటి పాలిష్
సరిగ్గా వాడి ముఖం లాగ!
మెరుపు కోసం వాడు
బ్రష్‌ని జోరుగా నడిపిస్తున్నప్పుడు చూసాను నేను
వాడి తల వెంట్రుకలు కూడా
బూట్లపై బ్రష్ కుచ్చులు లాగ
ముఖంపై కదలాడుతున్నాయి
చేతిని ఎంత స్పీడుగా కదిలిస్తున్నాడో
తలకూడా అంతే జోరుగా తిప్పుతున్నాడు
ఒకమారు బూట్లపై
మరొక మారు ముఖంపైనా అన్నట్లుగా...
కొంత సమయానికి
వాడి శ్రమ ఫలితంగా
అద్దంలా మెరిసే బూట్లు తయారు
వాటిలో ముఖాన్ని కూడా తిలకించవచ్చు
కానీ
ఇది కూడా అంతే నిజం
అదే అమాయక ముఖం
అలాగే ఉంది
కాంతి విహీనంగా !



కథ

మద్దెర్ల రమేశ్
✆ 9985135177

# విముఖత



"అమ్మా... నువ్వెన్ని చెప్పినా నాకు నేనుగా మాత్రం వెళ్ళను".

"అంతగా మొండి పట్టుపట్టడానికి .... అతడు చేసిన క్షమించరాని నేరమేమిటో!"

"నన్ను నన్నుగా చూడకపోవటం కన్నా పెద్ద అవమానమేముంటుంది నాకు.?"

"అందులో అవమానమేముంది? భర్తగా నీపై అతని హక్కు లేదా?"

"భార్యను మానసికంగా చంపేయడం అతని హక్కా!"

"హక్కు కాదు, అవసరం."

"తన చదువు... తన తెలివితేటలు మాత్రం తనకు సమాజంలో గుర్తింపు తెచ్చి పెట్టాలి. నా చదువు.. నా విజ్ఞానం అంతా నిరుపయోగంగా ఇంట్లో మూలకు పడి ఉండాలి. ఇదెక్కడి న్యాయం? నేను కష్టపడి చదువుకున్న చదువు, సర్టిఫికెట్లు అన్నీ వృధాయేనా? నా భవిష్యత్తు గూర్చి నాన్న ఎన్ని కలలు కన్నారు? నాకు సమాజంలో ఒక గుర్తింపు వస్తే చూసి మురిసిపోవాలని ఎంత ఆశపడ్డారు! అవ్వన్నీ అలా ఉంచు. ఆనాడు మనింట్లో కూర్చుని మాట్లాడుకున్నప్పుడు ఏమన్నారు? ఇద్దరూ బాగా చదువుకున్నవాళ్ళు ఇద్దరూ ఉద్యోగాలు చేస్తే జీవితం విలాసవంతంగా గడపవచ్చు. ఇద్దరూ ఎవరి ఉద్యోగాలు వారు చేసుకోవడానికి ఎటువంటి అభ్యంతరాలు ఉండవని అందరూ ఒప్పుకున్నాకే కదా పెళ్ళికి నిశ్చయమైంది! మరిప్పుడెందుకిన్ని మాటలు చెప్తున్నారు?

"అవసరం అని చెప్పాను కదా ఎప్పటి అవసరం అప్పుడుంటుంది. అప్పుడు పెళ్ళి జరిపించడం కోసం అలా మాట్లాడుకున్నాం. వెయ్యి అబద్ధాలు ఆడయినా ఒక పెళ్ళి చెయ్యమన్నారు. తల్లి దండ్రులుగా మేమే కదా అప్పుడు మాట్లాడింది. మళ్ళీ మేమే కదా నిన్ను ఇప్పుడు ఒప్పుకోమంటుంది! ఏం... మా బిడ్డ ఎక్కువ సుఖంగా బతకాలని కోరుకోవడం మా తప్పా. రోజూ ఉరుకుల పరుగుల జీవితంలో ఏం సుఖముంది నీకు? రాత్రంతా పుస్తకాలు చదవడం పొద్దుందాకా అరచి అరచీ రావడం అందులోనే సుఖముందా నీకు?"

"అవును అందులోనే సుఖం, సంతోషం, ఆనందం, అవన్నీ ఉన్నాయి. మనిషై పుట్టినందుకు మనుషుల్తో కలిసి తిరగడంలోనే ఆనందం ఉంది. పనిముట్ల మధ్య పనిముట్టుగా బతకడం కంటే మనుషుల మధ్య మనిషిగా బతకడంలోనే అసలైన ఆనందం... జీవన పరమార్థం ఉంది".

'అయితే... ఈ కంప్యూటర్లు ఈ డెవలప్‌మెంట్ అంతా వ్యర్థమేనంటావా?"

"అవి పనికి రావనేంత మూర్ఖురాలిని కాను"

"అయితే... ఉన్న స్థితి కంటే ఉన్నతమైన స్థితికి చేరుకోవడం మాత్రం వద్దంటావు.... అంతేనా?"

"మన ఇంట్లో నేను చిన్నప్పుడు చదువుకునే నాటి స్థితికి చాలా మార్పు వచ్చింది. వచ్చిన మార్పంతా ఉన్నతంగానే ఉంది. దాన్ని నేనేమి కాదనట్లేదు. అప్పుడు ఇప్పుడు కూడా మన సంబంధాల్లో కూడా ఏం తేడా లేదు. ఆత్మీయతలు అనుబంధాలు ఇంకా చెక్కుచెదరలేదు. నాన్న నువ్వు నన్ను బిడ్డగానే చూస్తున్నారు. ఇంకా గుండెల నిండా ప్రేమ నింపుకొనే ఉన్నారు. కానీ, నిన్న గాక మొన్న వచ్చి పెళ్ళి పేరుతో బంధం

ముడివేసుకొని భర్త అనే అధికారంతో నా మీద ఎన్నో ఆంక్షలు పెడుతున్నాడు. ఈ రోజు ఎంతో కష్టపడి సంపాదించుకున్న నా ఉద్యోగాన్ని వదిలేసి తనతో అమెరికాకు రమ్మంటున్నాడు. రేపు, నా వయసుతో పాటు రూపుదిద్దుకున్న నా వ్యక్తిత్వాన్ని కూడా వదులుకొని, తనకు పుష్కలంగా డబ్బు సంపాదించి పెట్టే కంప్యూటర్ తన చేతి పనిముట్టుగా మారిపొమ్మన్నా అనగలడు. భర్తగా అతనికున్న హక్కుతో ఎలా అయినా ఉపయోగించుకోగలడు. వ్యక్తిత్వమంటూ కోల్పోయాక చేయగలిగేదంటూ ఏమీ ఉండదు. అందుకే అతని ఆలోచన తెలిసిన వెంటనే అతన్నించి దూరంగా వచ్చాను.

"అయితే అతనితో విడిపోవడానికే సిద్ధపడుతున్నావా?"

"నేను నా ఉద్యోగాన్ని విడిచి పెట్టడానికి ఇష్టపడటం లేదు. అంతే."

"నువ్వు హైదరాబాద్‌లో, అల్లుడు అమెరికాలో, కాపురమెలా సాగుతుంది?"

"కాపురమే ముఖ్యమనుకుంటే సాగుతుంది."

"కాపురం ముఖ్యమనుకున్నవాళ్ళు అమెరికా వెళ్ళవచ్చు కదా!"

"అమెరికా వెళ్ళితే తప్ప బ్రతుక లేమనే పరిస్థితి లేదు కదా!"

"ఈ రోజుల్లో అమెరికా వెళ్ళడమంటే ఎంత గొప్పగా అనుకుంటున్నారో తెలిసే మాట్లాడుతున్నావా?"

"అమెరికాకు వెళ్ళి ఎన్ని అగచాట్లు పడుతున్నారో అన్నీ తెలిసే మాట్లాడుతున్నాను".

"అందరూ అలాగే ఉంటారనుకోవడం అంత తెలివైన పనికాదు."

"ఉద్యోగాన్ని వదులుకొని పోయి ఇంట్లో మూలక్కూచోవడం కూడా అంత తెలివైన పనికాదు".

"అమెరికాలో చేసే వాళ్ళకు ఏదో ఒక పని దొరకక పోదు."

"హార్డువేరు ఇంజనీరు గారి పనిచేసే కంప్యూటర్ల తయారీ కంపెనీలో నేనూ ఒక కంప్యూటర్‌గా మారడమే కదా పని దొరకడమంటే?"

"అదే కంపెనీలో చేయాలనే ముంది? మరేదయినా..."

"మరేముంటుంది? తెలుగు సాహిత్యంలో డాక్టరేట్ తీసుకొని డిగ్రీ కాలేజిలో లెక్చరర్‌గా చేస్తున్న నాకు అమెరికాలోని ఏ యూనివర్శిటీ అయినా రమ్మని పిలిచి ప్రొఫెసర్ ఉద్యోగమేమయినా ఇస్తుందా?

"అసలు ఉద్యోగం చెయ్యవలసిన అవసరమే ముందని? మీ మామగారు సంపాదించిన ఆస్తి బోలెడుంది. కంపెనీలో వాటా ఉంది కనక, తానూ హార్డ్‌వేర్ ఇంజనీర్ కాబట్టి కంపెనీ వ్యవహారాలు చూసుకోవడం కోసం వెళ్ళుతున్నాడు. నువ్వు వెళ్ళాల్సిందే కదా. భర్తతో పాటు భార్య ఉండాలనడం తప్పా!"

"అదే నేనూ అంటున్నాను. భార్యతోపాటు భర్త ఉంటే తప్పా అని!"

"ఇదెక్కడి మొండి వాదమే తల్లి? మంచికో చెడుకో ఉన్న ఇంటి కోడలివయ్యావు. చక్కగా కాపురం చేసుకోక ఇదెక్కడి వైపరీత్యమే"

"నేనూ కాపురం చేసుకోవాలనే అనుకుంటున్నాను కదమ్మా. నువ్వన్నట్టు మంచికో చెడుకో అనుకోకుండా మంచికే నేనూ ఇలా మాట్లాడుతున్నాను జరిగేదంతా జరిగాక చేసేదేమి ఉండదు. అందుకే ముందుగానే ఇలా అంటున్నాను".

"అయితే, అల్లుడిగారి దగ్గరికి వెళ్ళనంటావ్".

"అమెరికాకు వెళ్ళనంటున్నాను"

"అదిగో అల్లుడే వచ్చినట్టున్నాడు... చూడు..."

"అవును, ఆయనే. బుజ్జగించి చెప్పడాలు మాని నేను మాట్లడేదేదో విను. నాన్నగారొస్తే... నాన్నకు కూడా అదే చెప్పు".

"ఏం నిర్ణయించుకున్నావ్?

"కొత్తగా నిర్ణయించుకున్నదేం లేదు. మొన్న మీతో చెప్పిన మాటలే ఫైనల్"

"ఇంకా నీ మొండిపట్టు మానవన్న మాట"

"అందులో నా మొండిపట్టు ఏముంది? మీరే నన్ను బలవంత పెడుతున్నారు. మీరు వెళ్ళండి.రెండు నెళ్ళకు మూడు నెళ్ళకు వచ్చినా ఫర్వాలేదు. నా వ్యాపకాలతో నాకు బాగానే గడుస్తుంది".



"నీకు గడుస్తుంది. మరి నాకు?"

"మీరూ మీ పనిలో మునిగిపోతారు కదా?"

"అంతే అంటావ్. కానీ, నాతో రానంటావ్"

"........................"

"నీ మొండితనంతో కోట్ల వ్యాపారాన్ని గాలికొదిలెయ్యమంటావ్",

"నీ వ్యాపారాన్ని వదిలెయ్యమని నేనన్లేదు".

"మనం లేకుండా మన పనులెవ్వరు చూస్తారు? కంపెనీ వ్యవహారాన్ని దగ్గరుండి చూసుకుంటేనే కదా నడిచేది?"

"ఏం ఫర్వలేదు. ఏ దేశంలో ఉన్నా ప్రపంచంలోని ఏ వ్యవహారాన్నయినా చక్కదిద్దుకునే సాంకేతిక పరిజ్ఞానం ఇప్పుడు దాదాపు అన్ని దేశాలకు అందుబాటులోకొచ్చింది. మన హైదరాబాదు కూడా కాస్త ముందడుగులోనే ఉంది. ఉండాల్సిందల్లా మనలో మాతృదేశంపై ప్రేమ, భక్తి".

అంటే నాకు అమెరికాపై వ్యామోహం ఎక్కువుందటావా?"

"మీ ఒక్కరి గురించి కాదు. ఇప్పుడు చాలామందిలో ఉన్న దాని గురించి కూడా మనం ఆలోచించాలి. చాలామందికి అమెరికాలో స్థిరపడిపోవాలన్న కోరికే ఉంటుంది. తీరా అక్కడ ఏదో చిన్న ఎదురుదెబ్బ తగిలినా దిగాలుపడిపోయి తిరుగు మొహం పడుతున్నారు. ఇక్కడకొచ్చి ఎందుకు కొరగాకుండా మిగిలిపోతున్నారు. చిటారు కొమ్మ నుండి చివాలున నేలకు రాలిపడ్డట్టుగా బాధపడిపోతున్నారు. ఇదంతా అమెరికాపై వ్యామోహంతోనే కదా! మీక్కూడా ఆ తిరుగుముఖం పరిస్థితి రాకూడదనే దొక్కటే కూడా కాదు నా విముఖతకు కారణం. మనం చదువుకున్న చదువులు, మన విజ్ఞానం మనకు, మన కుటుంబానికి మాత్రమే పరిమితం కాకూడదు. మనచుట్టూ ఉండి మనతోపాటు జీవిస్తున్న మనదేశ ప్రజలందరి సుఖ, శాంతులకు అభివృద్ధి ఉపయోగపడాలి. అప్పుడే మన జీవితం సార్థకమవుతుంది. నా

## మౌన వేదన

- విడదల సాంబశివరావు
✆: 9866400059

లక్షలాది ఆశలు నా అంతరంగంలో
కోట్లాది కోరికలు నాహృదయ కుహరంలో
నాగడి (దివాణం/ఇల్లు) నిండా లక్షల కోట్ల కరెన్సీ కుప్పలు
కానీ, మనసు మాత్రం మూగగా విలపిస్తోంది
ఆశలు తీరని అంతరంగంలో నిర్లిప్తత
కోరికలు కొండెక్కిన హృదయ కుహరంలో నిరాశ, నిస్పృహ
నాకేం కావాలో నాకు తెలియని దుస్థితి
నాకేది అవసరమో నాకు అర్థం కాని అయోమయ పరిస్థితి
నా చుట్టూ ఉన్న ప్రపంచం
అంధకారంలో అలమటిస్తోంది
నా ఇంటి ప్రక్కన మరణ మృదంగ ఘోష
అనారోగ్యపు వేదన
ఆకలి మంటల రోదన
పేదరికం శాపమైన వేళ
చదువు కొనలేని బిడ్డలు
దొంగలుగా మారిన దయనీయ స్థితి
అందమైన జీవితం కోసం ఆరాటపడి
జీవన పోరాటంలో ఓడిపోయి
వెలయాలుగా మారిన మహిళ మనోవేదన
మద్యానికి లైసెన్స్ షోకు
తాగి చెడిపొమ్మని మనిషికి
ప్రభుత్వమిచ్చిన పర్మిషను
వీధినపడ్డ కాపురాలు
ఛితికిపోయిన జీవితాలు
ఈ మనుషుల నడుమ నేను
లక్షలాది ఆశలు నా అంతరంగంలో
కోట్లాది కోరికలు నా హృదయ కుహరంలో
నా గడి నిండా లక్షల కోట్ల కరెన్సీ కుప్పలు



## రెండు

విజయ భాను కోటి
✆: 9291509637



రెండు పార్శ్వాలు
ఒకటి నువ్వు
ఒకటి నేను
యుద్ధం చెరిసమానం
నేలరాలిన అశ్రువులు
మట్టితో మమేకం!
రెండు గుణాంకాలు
ఒకటి దుఃఖం
ఒకటి కష్టం
నష్టం చెరిసమానం
గాలికెగిరిన ప్రమాణాలు
అమానుషత్వానికి
మనమిచ్చే అంకితం!
రెండు సంచులు
ఒకటి ఆత్మ
ఒకటి జీవిక
ఊపిరి చెరిసమానం
వెర్రితలలు వేసిన అత్యాశ
ప్రపంచపోకడ
మార్చిన మనవైనం!
రెండు ఆలోచనలు
ఒకటి ఎరుపు
ఒకటి నలుపు
మేధస్సు చెరిసమానం
పదునెక్కిన కుట్రలు
నిశీధి పొరల్లోకి నెట్టబడ్డ
నిజం!
రెండు త్రాసులు
ఒకటి నిప్పు
ఒకటి శూలం
పొడిచిన పోటు
చెరిసమానం
ధ్వజమెత్తిన హీనక్రియలు
నెత్తురు చిమ్మిన క్రోధం !!!

---

అభిప్రాయాలపై మీకేమైనా వ్యతిరేకత ఉంటే నేను చేయగలిగిందేమీ లేదు."

"అవును లే నువ్వు చేయగలిగిందేమిలేదు. చేయాల్సిందల్లా చేసి చూపించావు నీ పుట్టినింటికి వచ్చేసావు ఇక నాతో రానంటావు. ఇటువంటి అభిప్రాయాలున్నప్పుడు నాలాంటి సంబంధాన్ని చూసుకోకుండా ఉండాల్సింది. సమాజంలో పరువు ప్రతిష్టతో జీవించే మా కుటుంబానికి ఓ మచ్చతెచ్చి పెట్టావు."

"నేను మీ ఇంట్లోంచి రావడం మీ కుటుంబానికి మచ్చకాదు. 'మా కుటుంబానికే పెద్ద మచ్చ' అని నేననాలికానీ అలా అనను. అలా అని నా స్వాభిమానాన్ని నేను కించపరచుకోలేను. కాకపోతే మీలాంటి వారికి ఒక సలహా ఇవ్వగలను. అమ్మాయి కోసం తిరుగుతున్నప్పుడు 'చదువుకున్న' అమ్మాయి కావాలి అని అడగం తప్పు, మీ లాంటి వాళ్ళకు యంత్రంలా పనిచేసే అమ్మాయి అయితే చాలు. చదువుకున్న అమ్మాయి కావాలని మరి మరి అడిగి వాళ్ళ చదువుల్ని తెలివితేటల్ని ఎందుకు పనికి రాకుండా చేస్తున్నారు. మీ పరువు ప్రతిష్ట సామాజిక హోదా కోసం మాత్రమే చదువుకున్న అమ్మాయి కోసం వెదకడం తప్పు".

"సరే. జరిగిన తప్పును ఒప్పుకుంటాను. నీతో జీవితాన్ని కోరుకోవడంలో తప్పు లేదనుకుంటాను."

"ముమ్మాటికి తప్పు లేదు".

"అమెరికా ప్రయాణానికి నీ విముఖత ఎందుకో తెలిసాక.... ఇంకా అమెరికా ప్రయాణమని అనాలన్పించట్లేదు".

"నిజంగా"

"మనింటికెళదామా"

"సంతోషంగా".



## వికసిత

వియస్సార్

వెల : రూ.150/- పేజీలు : 300

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్, 27608107

ప్రచురణ : సాహితీస్రవంతి

ఐటీ... ఈ తరానికి కలల పంట. హోదా, అంతస్తు, సంపాదన, గౌరవం - ప్రతి ఒక్కరూ ఊహించుకునే చిత్రమిది. కాని నాణెనికి రెండోవైపున ఎదురీతలెన్నో. చదువు, సీటు, ఉద్యోగం, ప్రమోషన్, స్థిరత్వం, కుటుంబం అన్నీ సమస్యలే. మానసిక వేదనలు, సామాజిక సంక్షోభాలు, రాజకీయ నాటకాలు వెంటాడుతున్న నీడలు. ప్రేమ, పెండ్లి...గజిబిజి. వ్యాపార సంస్కృతి మోసుకొస్తున్న ఒంటరితనం. విచ్చలవిడితనం. జవాబుల్లేక మిగిలిపోతున్న అనేకానేక ప్రశ్నలు.

ఈ భావ సంఘర్షణల ప్రతిబింబమే "వికసిత", సామాజిక పురిటిగడ్డలో ఉద్భవించి, వికసించిన పరిమళం... నిత్య, అక్షయ్, రాజమౌళి, ఆకాశ్, అశ్రిత... ఇలా ఎన్నో పాత్రలు, వర్తమాన వీచికలు.



## చిత్రనేత్రం

గుడిపూడి విజయరావు

వెల : రూ.200/- పేజీలు : 273

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్, 27660817

2006 నుండి 2012 వరకు హైదరాబాదులో కొన్ని కళా ప్రదర్శనలపై కథనాల సమాహారం ఇది. చిత్రకళ పట్ల అభిరుచి ఉండి తెలుసుకోవాలన్న ఆసక్తి కలిగిన వారు ఈ కథనాలను క్రమపద్ధతిలో చదివితే మంచి అవగాహనను అందించగలవు. చిత్రకళను ఎలా ఆస్వాదించి, అర్థం చేసుకోవాలో తెలియచెప్పేంతటి సమాచారం, వివరణ, విశ్లేషణ దీనిలో ఉన్నాయి.

ప్రజాశక్తి బుక్‌హౌస్



## మంటో కథలు

సాదత్ హసన్ మంటో

తెలుగు అనువాదం : ఎజి. యతిరాజులు

వెల : రూ.50/- పేజీలు : 84

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్, 2660817

దేశ విభజన చరిత్ర వాస్తవానికి భారత - పాకిస్తానీ మహిళల శరీరాలపైన మాత్రమే రాయబడ్డ చరిత్ర. ఈ సత్యాన్ని రక్తం కలగలసిన భాషలో మనకు మొట్టమొదట తెలియజేసిన రచయిత మంటో. ఆయన్ను అందరూ 'మంటో మామ' అని పిలిచేవారు. దక్షిణ భారతదేశంలోని మనందరికీ దేశ విభజన సమయంలో ప్రజలు పడ్డ కష్టాలు పెద్దగా తెలీదు. ఆనాటి నిజ చిత్రాలను ఈ మంటో కథల్లో మనం చూడొచ్చు.

- ప్రచురణకర్త



## నిమాషి

దళిత తిరుగుబాటు

కవిత్వం

వేముల ఎల్లయ్య

వెల : రూ.20/-

పేజీలు : 39

ప్రతులకు :

9440002659.

గోవులు భూములు బావులు పల్లె కుల వ్యవస్థకు చిహ్నాలయితే లక్ష్మింపేట మాలల్నీ మట్టుబెట్టటానికి మాటుగాసిందెవరూ వెనుకబడిన కులదాడా! వెనుక దాగున్నదెవరూ?

- వేముల ఎల్లయ్య



## ఒక యుద్ధం తర్వాత...

నవల

యస్. మునిసుందరం

వెల : రూ.172/- పేజీలు : 157

ప్రతులకు : 0877-2220769

అనుకోకుండా నేను రాసిన మొదటి నవల ఒక యుద్ధం తర్వాత... ఆంధ్రదేశంలో ఒక సుప్రసిద్ధ మాసపత్రిక 'చతుర'లో ఇది అచ్చు అయింది. ముప్పయ్ ఐదేళ్ళ 'చతుర' సంపాదకులు. "మరో కోణంలో మహాభారతం" అని కూడా వాళ్లన్నారు. నిజమే. మహాభారతాన్ని ఇట్లా కూడా రాయవచ్చు. అని నేననుకున్నది చరితార్థమయింది.

- ముని సుందరం



## బతుకు బండి

గనారా కథలు

సాహితీ స్రవంతి

వెల : రూ.40/- పేజీలు : 67

ప్రతులకు : 995140671

రచయిత గనారాకి బడుగు జీవితంపై ప్రేమ వుంది. ఆ జీవితాల్లోని భిన్నత్వం తెలుసు. ఆ జీవితాల్లో ఒకరి కష్టం యింకొకరు పంచుకొనే మానవీయ లక్షణం comraderie ఈయనకి తెలుసు ఆర్తితో కదులుతాయి అతని పాత్రలు. ఆ పాత్రల్లో positive లక్షణాలే వుంటాయి. ఆఖరికి లంచం తీసుకున్న శానిటరీ ఇన్‌స్పెక్టర్, వ్యాపారం చేసుకొని బాగా బతికిన షావుకారు లాంటి వాళ్ళు కూడా.

- సి. ఉమామహేశ్వరరావు




**బాలల భువన విజయం**
సాహిత్య రూపకం
కేఎస్వీ
వెల : రూ.25/- పేజీలు : 32
ప్రతులకు : ఓరియన్ పబ్లికేషన్స్

తెలుగు వారు తెలుగును బాగా మరచి పోతున్న కాలం ఇది. ఆంగ్ల భాషా వ్యామోహం ఎక్కువవుతున్నదే గాని తగ్గే సూచనలేవీ లేవు. బడిపిల్లలలో తెలుగు భాష మీద సాహిత్యం మీద కొంతయినా ఆసక్తి కలిగించడానికి రాసిన సాహిత్య రూపకం ఈ 'బాలల భువన విజయం'

కేఎస్వీ




**అగాధం**
కె. అశ్విని
వెల : రూ.75/- పేజీలు : 80
ప్రతులకు : 27645536

దుఃఖపు లోయ లోతుల్లో ఎంత చీకటి వుంటుందో, ఆ గాఢాంధకారంలో అక్కడెక్కడా వెలిగే మిణుగురుల కాంతిని చూడగలిగిన ఆస్కార్ వైల్డ్ "డి ప్రోఫండిస్" రచనలో ఎంతటి భావసాంద్రత వున్నదో తెలుస్తుంది, చదవండి.

కె. అశ్విని




**ఇంకా ఉలికందని శిల**
డా. టీ.వీ భాస్కరాచార్య
వెల : రూ.116/- పేజీలు : 112
ప్రతులకు : 9394513044

భాస్కరాచార్య టీ.వీ. కవి మాత్రమే కాదు విమర్శకుడు, పరిశోధకుడు, రంగస్థల సినీనటుడు, నాటకప్రయోక్త... కళాత్మకంగా ఉండడం ఆయన జీవనశైలిలో అంతర్భాగం. పుస్తక ప్రచురణ ఆసక్తికరంగా ఉంది. ఇతివృత్తం కావ్యాత్మ దాని కాలీనత... కాలిన స్పృహ కావ్యానికి మంచి దృశ్య లక్షణాన్ని చేకూర్చింది.

శివారెడ్డి




**చీకటి గీతలు**
కథలు
గవర ఈశ్వరరావు
వెల : రూ.100- పేజీలు : 156
ప్రతులకు : 9052175544

ఈశ్వరరావు కథలన్నీ నేలపై నడిచే ఇతి వృత్తాలు కల్గినవి. మధ్య తరగతి సమస్యలూ, ఆ వర్గం వారి మనస్తత్వాల్లోని వైరుధ్యాలూ ఆ కారణాన జనించే క్షోభలూ... వీటన్నిటి ఆవిష్కరణ జరిగింది. ఒకటి రెండు కథల్లో (రాళ్ళెత్తిన కూలీలు వంటివి) పేద బతుకుల పట్ల ఆలోచనాపరుడిగా రచయిత దృక్పథం ద్యోతకమైంది.

- విహారి




**యెల్డి పగడాలు**
కవితల సంపుటి
యెల్డి సుదర్శన్ పద్మశాలి
వెల : రూ.60/- పేజీలు : 95
ప్రతులకు : 09892411067

ఈ 'యెల్డి పగడాలు'లో సుమారు డెబ్బయి కవితా ఖండికలున్నాయి. వీటిల్లో యువతకు సందేశం, అవినీతి పట్ల ఆవేదన, కుహనా రాజకీయాల పట్ల అసహ్యం, దేశం పట్ల అభిమానం, కన్న తల్లిదండ్రులంటే ఆరాధనా భావం, స్నేహధర్మం, ప్రకృతి వైపరీత్యాలతో ఛిద్రమైపోయిన జీవితాల పట్ల సానుభూతి, ఉగ్రవాదం పట్ల ధర్మాగ్రహం, తెలుగు భాష పట్ల మమకారం, పర్యావరణ పరిరక్షణాభిలాష - ఇట్లా అనేక భావాల సంపుటి ఈ సంకలనం.

- యెల్డి సుదర్శన్ పద్మశాలి




**గుండెలోతు**
కథల సంపుటి
యస్. శ్రీదేవి
వెల : రూ.70/- పేజీలు : 160
ప్రతులకు : విష్ణు పబ్లికేషన్స్

ఎప్పటిలాగే యీ పుస్తకానికి కూడా ముందుమాట లేదు. ఇండియా టుడే, విపుల, ఆంధ్రభూమి రచన వంటి ప్రముఖ పత్రికల్లో నిష్ణాతులైన సంపాదకుల ఎంపికలో అచ్చైన ఈ కథలని మరో మాటు పరిచయం చెయ్యాలనుకోవటం లేదు.

యస్. శ్రీదేవి

# సమకాలీన సంఘర్షణ 'వికసిత'

సమకాలీన ప్రపంచీకరణ సంక్షుభిత సమయపు భావ సంఘర్షణలను ప్రతిబింబించిన నవలే వియస్సార్ రచించిన నవల 'వికసిత' అని సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అన్నారు. సాహితీస్రవంతి ఆధ్వర్యంలో హైదరాబాద్ బుక్‌ఫెయిర్ ప్రాంగణంలో డిసెంబర్ 22న పుస్తకావిష్కరణ జరిగింది. విశాలాంధ్ర బుక్‌హౌస్ మేనేజర్ బి. ఈశ్వర్‌రెడ్డి అధ్యక్షత వహించిన ఈ సభకు ముఖ్య అతిథిగా హాజరయిన తెలకపల్లి రవి పుస్తకాన్ని ఆవిష్కరించి మాట్లాడారు. సాహిత్య ప్రాముఖ్యతను తెలుపుతూ, అది ప్రస్తుత పరిస్థితులకు ఎలా అవసరమో వివరించారు. సమాజం వికారంగా ఉన్నప్పుడు వికాసం కోసం రచయితలు బాధ్యతగా కృషిచేయాలన్నారు. వివిస్సార్ కాలమిస్టుగా, జర్నలిస్టుగా సమకాలీన ప్రపంచంలో సంక్షుభిత సమయంలో బాధితుల బాధల్ని కళ్లకు కట్టినట్టు చూపారన్నారు.

దేశ రాజధాని నగరంలో జరిగిన రాక్షసకాండకు వ్యతిరేకంగా అక్కడ నిరసన వెల్లువెత్తుతోంది. ఆ నిరసన గళానికి బలం చేకూరుస్తూ, సామాజిక మార్పునకు సాహిత్యం దోహదం చేసే ప్రక్రియగా ఉంటుందన్నారు. సాఫ్ట్‌వేర్ రంగం విస్తరిస్తోందని, సమాజం మాత్రం సాఫ్ట్‌గా లేదని, అది హార్డ్‌గానే ఉందని అన్నారు. చదువు, సీటు, ఉద్యోగం, ప్రమోషన్, స్థిరత్వం, కుటుంబం తదితర సమస్యలతో మానసిక వేదనలకు గురై సామాజిక సంక్షోభాల మధ్య, ఇంజనీరింగ్ విద్యార్థుల, అధ్యాపకుల మధ్య జరుగుతున్న సంభాషణను వస్తువుగా తీసుకొని సామాజిక పరిస్థితుల గుండా సాగిన కథే ఈ నవల సారమని చెప్పారు. ఇది మరిన్ని నవలలకు స్ఫూర్తిగా ఉంటుందన్న ఆశాభావం వ్యక్తం చేశారు. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ లినిత మాట్లాడుతూ ఈ నవలలోని ఎక్కువ అంశాలు స్వీయానుభవంగా అనిపిస్తాయని అన్నారు. ప్రొఫెసర్ ప్రతాప్ మాట్లాడుతూ యువతరానికి ఎదురవుతున్న సంఘర్షణలు, ఇందులో నుంచి పుట్టుకొస్తున్న కొత్త ఆలోచనలను ప్రతిబింబించేలా నవల సాగిందన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్, ప్రజాశక్తి బుక్‌హౌస్ మేనేజర్ కె. లక్ష్మయ్య, కిరణ్ చంద్ర, భువన్, సిద్ధార్థ, నవీన్, అరుణ, ఆశ తదితరులు పాల్గొన్నారు.




వియస్సార్ రచించిన 'వికసిత' నవలను ఆవిష్కరిస్తున్న సాహిత్య ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి. చిత్రంలో విశాలాంధ్ర బుక్‌హౌస్ మేనేజర్ బి. ఈశ్వరరెడ్డి, ప్రొ॥ ప్రతాప్, లినిత

# అలరించిన "అక్షరాంజలి"

**14** డిసెంబర్ 2012 నుండి 25 డిసెంబర్ 2012 వరకు హైదరాబాద్ నెక్లెస్ రోడ్డులోని పీపుల్స్ ప్లాజాలో నిర్వహించబడిన 27వ హైదరాబాద్ బుక్‌ఫెయిర్‌లో "అక్షరాంజలి" స్టాల్ ఆకట్టుకుంది. "రేపటి తరానికి మన సాహిత్యం, సాహిత్యకారులు, వారి జీవిత విశేషాలు తెలియజెప్పాల్సిన అవసరం ఎంతో వుందని" పలువురు సందర్శకులు అన్నారు. ఈ ఛాయా చిత్రాలన్నింటిని ఓ పుస్తకంగా ప్రచురించాలనే తమ ఆకాంక్షను తెలియజేశారు. సాహితీ స్రవంతి ప్రచురణలు, మహాప్రస్థానం, శ్రీశ్రీజయభేరి, కందుకూరి వారి హాస్య సంజీవని, చేగువేరా డైరీ, తెలుగు సామెతలు.. వంటి పుస్తకాలు ఉత్సాహంగా కొనుగోలు చేశారు. హెరాల్డ్ పింటర్, జూలియస్ ఫ్యూజిక్, బ్రెఫ్ట్, మైఖేల్ షోలూకోవ్, రోమారోలా, గోర్కీ, క్రిస్టోఫర్ కాడ్వెల్, ఎర్నెస్ట్ హెమింగ్వే, జాన్‌పాల్ సార్త్రే, గోగోల్‌లాంటి అంతర్జాతీయ కవులు - వారి రచనలు, వాటి దొరుకు చోటు ఆసక్తిగా అడిగారు. అలాగే మన భారతీయ కవులు, ఠాగూర్, ప్రేమ్‌చంద్, సుబ్రహ్మణ్యభారతి, కె.వి. అబ్బాస్, హరివంశరాయ్ బచ్చన్ లాంటి వారి చిత్రాలు, వారి రచనలు.. విద్యార్థులు ఉత్సాహంగా నోట్ చేసుకొన్నారు. ఇక మన తెలుగు కవుల ఫొటోలు, ఇటీవల కన్నుమూసిన ప్రముఖ సాహితీవేత్తల ఫొటోలు (సెప్టెంబర్ ప్రస్థానం పత్రిక ముఖచిత్రం) అడిగి తెలుసుకొని ఆ సంచికను బాగా కొనుగోలు చేశారు. కాపు రాజయ్య, సదాశివ, కొండపల్లి శేషగిరిరావుగార్ల సాహిత్యం, పెయింటింగ్స్ అడిగి తెలుసుకున్నారు.




సాహితీ స్రవంతి నిర్వహించిన ప్రసిద్ధ సాహిత్యవేత్తల చిత్రాల ప్రదర్శన 'అక్షరాంజలి' స్టాల్‌లో సందర్శకులు

కొప్పరపు కవులు, విశ్వనాథ, అజంతా, శ్రీశ్రీ, శేషేంద్రశర్మ, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి, మధునా పంతుల తిరుపతి కవుల ఫొటోలు పెద్దల్ని విశేషంగా ఆకర్షించాయి. ఫోమ్ ల్యామినేషన్‌లో చేసిన ఈ ఛాయాచిత్రాలు ఆకర్షణీయంగా ఉన్నాయని పలువురు అన్నారు. ఇల్లిందుల సరస్వతి, భార్గవీరావు, భానుమతి, వాసిరెడ్డి సీతాదేవి, బండారు అచ్చమాంబ, హేమలతా లవణం లాంటి మహిళా సాహితీమూర్తుల ఫొటోలు ఈ ప్రదర్శనలో ఉన్నాయి. ఈ స్టాల్‌ను సాహితీ స్రవంతి బాధ్యులు తంగిరాల చక్రవర్తి నిర్వహించారు.



హైదరాబాద్ బుక్‌ఫెయిర్‌లో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో 'అక్షరం'పై జరిగిన జనవకనం. చిత్రంలో తంగిరాల చక్రవర్తి, కవి యాకూబ్, శాంతిశ్రీ, జి. యాదగిరి రావు

## సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో కవి సమ్మేళనం

డిసెంబర్ 23న సాయంత్రం 6 గంటల నుండి 7 గంటల దాకా "అక్షరం" శీర్షికన హైదరాబాద్ బుక్‌ఫెయిర్ వేదికపై కవి సమ్మేళనం జరిగింది. హైదరాబాద్ నగర సాహితీ స్రవంతి ప్రధాన కార్యదర్శి జి. యాదగిరిరావు స్వాగతం పలికారు. నగర కమిటీ సభ్యురాలు శాంతిశ్రీ అధ్యక్షత వహించారు. ప్రముఖ కవి యాకూబ్ ముఖ్య అతిథిగా విచ్చేశారు. యువ కవులతో పాటు సీనియర్ కవులు, ప్రముఖులతో మరింత పెద్ద స్థాయిలో ఈ జనకవనం నిర్వహించాలని, యువ కవులు బాగా అధ్యయనం చేసి మంచి కవిత్వం రాయాలని యాకూబ్ తన ప్రసంగంలో పేర్కొన్నారు. 'అక్షరం'పై స్వీయకవిత చదివారు. కవి సమ్మేళనాన్ని తంగిరాల చక్రవర్తి నిర్వహించారు. 23 మంది కవులు స్వీయ కవితాగానం చేశారు.



**అనంతపురం సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో తెలుగు భాషా వికాసం కోరుతూ నిర్వహించిన ర్యాలీని పుట్టపర్తి శాసనసభ్యులు పల్లె రఘునాథ రెడ్డి జెండా వూపి ప్రారంభిస్తున్న దృశ్యం. చిత్రంలో సాహితీస్రవంతి నాయకులు తగరం క్రిష్ణయ్య, డా. అంకే రామలింగయ్య, ఆకుల రఘురామయ్య, ఉద్దండం చంద్రశేఖర్, సాకే నరేష్, మధురశ్రీ, డా. జెన్నె ఆనంద్‌కుమార్, ప్రజ్ఞా సురేష్, ఎర్రిస్వామి తదితరులు పాల్గొన్నారు.**

# గురజాడ రచనలు నేటికాలానికి మరింత అవసరం




గురజాడ వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న కథా రచయిత యాళ్ళ అచ్యుతరామయ్య. చిత్రంలో తంగిరాల చక్రవర్తి, వొరప్రసాద్ ఉన్నారు.

కాలానికి కంటే ముందు పయనించిన వ్యక్తి గురజాడ అని వక్తలు కొనియాడారు. సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో నవంబరు 30న సుదరయ్య విజ్ఞాన కేంద్రంలో 'తెలుగు సాహిత్యం గురజాడ' అనే అంశంపై సదస్సు జనకవనం నిర్వహించారు. ఈ సందర్భంగా ముఖ్య అతిథిగా పాల్గొన్న యాళ్ల అచ్యుతరామయ్య మాట్లాడుతూ సమాజం చీదరించుకున్న వ్యక్తులను ఆదరించి, అక్కున చేర్చుకున్న మహాభావుడు గురజాడ అని కొనియాడారు. 150 ఏళ్ల అనంతరమూ ఆయన వాక్యాలను నిత్యజీవితంలో నానుడిగా వాడుతున్నామని ప్రశంసించారు. ప్రముఖ రచయిత చేకూరి రామారావు మాట్లాడుతూ సామాజిక దురాగతాలపై పోరాటమే సాహిత్య లక్ష్యమని, అభ్యుదయ సాహిత్యాన్ని సృజించిన వారు గురజాడ అని వివరించారు. ఈ సందస్సుకు అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ మాట్లాడుతూ ఆయన ప్రతి రచనలోనూ సామాజిక ప్రయోజనం పుష్కలంగా ఉంటుందన్నారు. నేటి ప్రపంచీకరణ ప్రాబల్యం పెరిగే కొద్దీ ఆయన సందేశాల అవసరమూ పెరుగుతోందని చెప్పారు. అనంతరం జరిగిన జనకవనంలో ప్రజావ్యతిరేక ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాలపై, సామాజిక అంశాలపై వినిపించిన కవితలు సభికులను ఎంతగానో ఆకుటుకున్నాయి. జనకవనాన్ని తంగిరాల చక్రవర్తి నిర్వహించగా సాహితీ స్రవంతి నగర కార్యదర్శి జి. యాదగిరిరావు, ప్రముఖ రచయిత మోతుకూరి నరహరి, శాంతిశ్రీ, వెంకట్, నరేష్, రాజశ్రీ తదితరులు పాల్గొన్నారు.

# ధృవతార గురజాడ

గురజాడ పుట్టి సాహితీ వినీలాకాశంలో ధృవతారగా వెలుగొందాడని యోగి వేమన విశ్రాంత తెలుగు ఆచార్యులు రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి అన్నారు. నవంబర్ 30 గురజాడ వర్ధంతి సందర్భంగా గురజాడ 150వ జయంతి ఉత్సవాలను పురస్కరించుకొని, కర్నూలు జిల్లా ఆదోని పట్టణంలో సాహితీ స్రవంతి డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. 6వ తరగతి నుండి పీజీ, బి ఎడ్ స్థాయి వరకు గురజాడ అప్పారావు జీవితంలోని అన్ని కోణాలను స్పృశిస్తూ విద్యార్థులకు వ్యాస రచన పోటీలను నిర్వహించగా విజేతల ఫలితాలను ఈ సందర్భంగా విడుదల చేశారు. డివిజన్ గౌరవాధ్యక్షుడు డా. సంజన్న అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో ఆయన మాట్లాడారు. గురజాడ 150 సంవత్సరాల క్రితం జన్మించి 90 సంవత్సరాల క్రితం మరణించినా ఈ రోజు మనం ఆయన గూర్చి మాట్లాడుతున్నామంటే ఆయన రచనల ప్రభావం సమాజంపై అంత తీవ్రంగా ఉండటమేనన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతీ నాయకులు కెంగారమోహన్, అవుల బసప్ప, సక్కిరి భాస్కర్‌లు, మెప్మా అధికారి రామాంజనేయులు, మిల్టన్ విద్యా సంస్థల అధినేత సగరి శ్రీనివాసరావు, షెల్లి పాఠశాల అధినేత ముక్తుంవలీ, శ్రీకృష్ణదేవరాయ పాఠశాల అధినేత హుసేనప్పలు పాల్గొని గురజాడపై సందేశాలిచ్చారు. అంతకు ముందు దేశమును ప్రేమించుమన్నా గీతాలాపన విద్యార్థులు చేయగా చిత్రపటానికి రాచపాళెం పూలమాల వేసి నివాళులు అర్పించారు. అనంతరం వ్యాస రచన పోటీలలో పాల్గొన్న విజేతలకు ధృవీకరణ పత్రాలు, బహుమతులు అందించారు.



ఆదోని పట్టణంలో సాహితీ స్రవంతి డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో జరిగిన గురజాడ వర్ధంతి. చిత్రంలో డా. రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి, డా. సంజెన్న, కెంగార మోహన్, జంధ్యాల రఘుబాబు, అవుల బసప్ప, సక్కిరి భాస్కర్, రామాంజనేయులు, సగరి శ్రీనివాసరావు ఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రభుత్వం నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమాల్లో భాగంగా పెద్దకడబూరు మండల కేంద్రంలో సాహితీస్రవంతి జిల్లా కార్యదర్శి కెంగార మోహన్ శ్రీకృష్ణ దేవరాయల పాత్రలో , అల్లూరి సీతారామరాజు పాత్రలో డివిజన్ కమిటీ సభ్యులు లక్ష్మీనారాయణ, గురజాడ అప్పారావు పాత్రలో మటం మల్లికార్జునయ్యలు వేషాలతో మండల పుర వీధుల గుండా నిర్వహించిన ప్రదర్శనలో ఆకట్టుకున్నారు. ఈ వేడుకల సందర్భంగా అధికారులు సాహితీ స్రవంతి నిర్వహిస్తున్న కార్యక్రమాలను అభినందించారు.

**- అవుల బసప్ప**



18 నవంబర్‌న సాయంత్రం రవీంద్రభారతి కాన్ఫరెన్స్ హాలులో కిన్నెర ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్య సభలో ప్రముఖ కవయిత్రి డా. సి. భవానీదేవి రచించిన కవితా సంపుటి 'రగలిన క్షణాలు" ను జ్ఞాన్ పీఠ్ అవార్డ్ గ్రహీత డా. సి. నారాయణరెడ్డి ఆవిష్కరించారు. సభలో ఆచార్య ఎన్. గోపి, కె. శివారెడ్డి, వై. రామకృష్ణారావు, కిన్నెర రఘురాం, కవయిత్రి పాల్గొన్నారు.



డిశంబర్ 11న త్యాగరాయ గానసభ, హైదరాబాద్‌లో జి.వి.ఆర్ ఆరాధన కల్చరల్ ఫెడరేషన్ నిర్వహించిన ఆర్థిక పథకం ఛైర్మన్ డా. ఎన్. తులసిరెడ్డి ద్వారా డా. ఎం.ఎస్. రెడ్డి స్మారక సాహితీ పురస్కారం స్వీకరిస్తున్న డా. రావూరి భరద్వాజ డా. ఉండేల మాల కొండారెడ్డి, గుదిబండి వెంకటరెడ్డి, పి. విజయబాయి, సి. రామకృష్ణ డా. ముక్తేవి భారతి తదితరులు.



డిశంబర్ 18న చికాగో నగరంలో ఓక్ బ్రూక్ పబ్లిక్ లైబ్రరీలో జరిగిన సభలో కవి, విమర్శకుడు డాక్టర్ పాపినేని శివశంకర్ రచించిన 'తల్లీ! నిన్నుదలంచి' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న డాక్టర్ జంపాల చౌదరి, వేదికపై రచయిత, జయదేవ్ తదితరులు...



గుంటూరులో అరసం ఆధ్వర్యంలో జరిగిన వట్టిగొండ విశాలక్షి సాహితీ సత్కార సభలో, సత్కారాన్ని స్వీకరిస్తున్న కథా ఉద్యమనేత విమర్శకుడు వాసిరెడ్డినవీన్. వేదికపై కథా రచయిత డా. చంద్రశేఖరరావు, కవి కె. శివారెడ్డి, నాటక కథా రచయిత వల్లూరు శివప్రసాద్, కథా రచయితల కాట్రగడ్డ దయానంద్, అరసం రాష్ట్ర అధ్యక్షులు పెనుగొండ లక్ష్మీ నారాయణ తదితరులు.



డిశంబర్ 9న నల్లగొండ పానగల్లు ఉత్సవాల సందర్భంగా కవి, కథా రచయిత మేరెడ్డి యాదగిరి రెడ్డి సన్మానిస్తున్న జిల్లా కలెక్టర్ యన్. ముక్తేశ్వరరావు జాయింటు కలెక్టరు హరిజవహర్‌లాల్.



డిశంబర్ 8న గుంటూరులో మల్లయ్య లింగం భవనంలో "ప్రపంచ శాంతి' కవి సమ్మేళనంలో సందేశమిస్తున్న గుంటూరు జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు సొమేపల్లి వెంకట సుబ్బయ్య, అధ్యక్షులు డా. వి. నాగరాజ్యలక్ష్మి. డా. సి.హెచ్ కళావతి, చ ఎస్. ఎం. సుభాని.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,



| మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A 1,45 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K DAVEED |
| పేజీలు విడదీసినది | K DAVEED |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |